# లాంగ్మన్స్ ఇండియన్ కథలు : శ్రీరాముని చరిత్ర

Madras, 1915

## Bibliographic Record Target

లాంగ్మన్స్ ఇండియన్ కథలు : శ్రీరాముని చరిత్ర.- Madras : Longmans Green and Co., 1915.

(2), 64 p. : ill. ; 19 cm.

Record no. 650

Lāṅgmans Iṃḍiyan kathalu : Śrīrāmuni caritra.- Madras : Longmans Green and Co., 1915.

(2), 64 p. : ill. ; 19 cm.

Record no. 650

LONGMANS' VERNACULAR SERIES FOR MADRAS



# Longmans' Indian Stories
for School Reading

GRADE IV

# 'he Story of Rama

TELUGU EDITION

లాంగ్మన్స్ ఇండియన్ కథలు

# శ్రీరాముని చరిత్ర




LONGMANS, GREEN & Co.
167, MOUNT ROAD, MADRAS
BOMBAY AND CALCUTTA
1915





# లాంగ్‌మన్‌జ్ ఇండియాదేశపు కథలు

## శ్రీరాముని చరిత్ర.

### ఇందలి విషయములు.

విషయసూచిక.



---

# శ్రీరాముని చరిత్ర

---

## అయోధ్యా నగరము, దశరథ మహారాజు

సరయూనదీ తీరమున కోసల యను దేశము కలదు. అది ధనధాన్యములును, పాడిపంటలును, కలిగి సకలసౌఖ్యాకరమై యుండెను. విశేష విఖ్యాతి గాంచిన అయోధ్యానగరము దానికి ముఖ్యపట్టణము. అయోధ్య యతి సుందరమైన నగరము. అందున్న మందిరములు మూడంతస్తుల మేడలు కలిగి పొడవైన వీథుల నలంకరించి యుండెను; సౌధముల మీది భాగములు చతురాకారములు కలిగి మిన్నంటుచుండెను. పౌరులు భాగ్యవంతు లగుటచే దినదినమును పుర మభివృద్ధి గాంచుచునే యుండెను; వీథులు కడు విశాలముగా నుండి, నగరమున తీరుగా నమరి యుండెను; ధూళి రేగకుండ ముఖ్యవీథులు బాగుగా తడుపుచుండిరి. అనేక గృహములకుచుట్టును చక్కని తోట లుండెను. అందు గున్నమావులు మొదలైన ఫల వృక్షములనేకములు కలవు. నగరము చుట్టును లోతైన అగడ్త యుండెను. ప్రహారము లందచ్చటచ్చట విశాలముగా నుండిన బహిర్ద్వారములు కలవు. అందుండి విలువిద్యయం దతికుశలులైన భటులు నగరమును సంరక్షించుచుండిరి.

శిల్పనైపుణ్యముల చెన్నొందు దేవాలయములును, స్నానముల కనుకూలములైన చక్కని గృహములును, సురభి వాతములతో నిండి చల్లని నీడలు నిచ్చు తోటలును, చతురాకారము గల ప్రాంగణములును, ధనురాకారము గల తోరణములును, ఎత్తైన ధ్వజస్తంభములును, కలిగి నానాజాతుల శిల్పకారులు, వణిజులు మొదలైన పౌరులతోను, రథాశ్వగజములతోను, పదాతులు, అశ్వారోహులు, రథసారథులు మొదలైన యోధవర్గముతోను, వేశ్యలు మొదలైన వివిధ గాయనీమణులతోను, భేరీమృదంగముల నినాదముతోను శోభిల్లుచున్న ఆ యయోధ్యానగరమును దశరథమహారాజు పాలించుచుండెను.

# II

## దశరథ మహారాజు అశ్వమేధము చేయుట

దశరథమహారాజు సర్వసంపన్నుడైనను, ఒక్క విషయమున నతడు కడు చింతాక్రాంతుడై యుండెను. అతని పరోక్షమున రాజ్యభారమును వహించుట కొక్క కుమారుడైన జన్మించియుండలేదు. అందుచేత నతడు బ్రాహ్మణుల రావించి, "విప్రవరులారా! పుత్రులకై పరితపించుచున్న నాకు ఒక కుమారుడైన కలుగ లేదు; కావున అశ్వమేధమును చేయ దలచితిని" అని చెప్పెను.

బ్రాహ్మణులు కడు సంతసించిరి. రాజపురోహితుడైన వసిష్ఠుని యాజ్ఞ చొప్పున యాగమునకు కావలసిన సామగ్రులు సిద్ధములై యుండెను; యాగమునకై నియమించిన గుఱ్ఱమును విడిచిరి. ఒక సంవత్సరానంతరము అశ్వమేధమారంభమయ్యెను. జనకమహారాజును, అంగ సింధు మగధ సువీర సౌరాష్ట్ర రాజులును, దక్షిణ దేశపృథ్వీపతులును యజ్ఞమును చూడవచ్చిరి. అప్పుడు వేలకొలది బ్రాహ్మణులకును, బీదలకును, పంచభక్ష్యపరమాన్నముల బెట్టించి, దశరథుడు వారిని సంతుష్టుల గావించెను. అందులకా విప్రులు దశరథునకు పుత్రులు కలుగునట్లు దీవించిరి. ఎల్లవారును దశరథుని యాదరమునకు కడు సంతసించి యతనిని వేనోళ్ల బొగడిరి. యాగము పూర్తి కాగా, హోమకుండమునుండి బంగారు కలశము చేత బట్టి లేచిన యొక దివ్యపురుషుడు కనబడెను. ఆ కలశమునిండ పరమాన్నముండెను. దాని నా దివ్యపురుషుడు దశరథునకియ్యగా, దశరథుడా పరమాన్నమును తన ముగ్గురు భార్యలకు బంచియిచ్చెను. వారు దానిని భుజించి శీఘ్రకాలములో గర్భిణులైరి. వారివలన దశరథునకు నలుగురు కుమారులు జన్మించిరి.

వారిలో పెద్దవాడు శ్రీరాముడు; ఇతడు దశరథుని ప్రథమ భార్యయగు కౌసల్య గర్భమున జన్మించినవాడు. రెండవ కుమారుడు భరతుడు; ఇతడు సుందరాంగియగు కైకేయి కడుపున బుట్టినవాడు. తక్కినవారు లక్ష్మణుడును, శత్రుఘ్నుడును; వీరు సుమిత్ర గర్భమున ఉద్భవించిరి.



ఈ నలుగురు కుమారులును, నానాటికి బెరిగి పెద్దవారైరి. లక్ష్మణునకు శ్రీరామునితోడను, శత్రుఘ్నునకు భరతునితోడను, సాహచర్యము కలిగెను. నలుగురు నొకరి నొకరు ప్రేమించుచు సౌభ్రాత్రమున నుండినను, బహుకాలము లక్ష్మణుడు శ్రీరామునితోడ అత్యంతానురాగముతో సహవాసము చేయుటయే జరగినది.

# III

## రాజకుమారుల బాల్యము

రాజకుమారులైదేండ్ల ప్రాయము గలవారైనప్పుడు వారికి వసిష్ఠుడు గురువయ్యెను. వారితల్లులు ముచ్చటలు తీరునట్లుగా వారిని వివిధ వస్త్రాలంకృతులను గావించి గురువువద్దకు బంపుచుండిరి. పీతాంబరములు శ్రీరాముడును, పలాశపటములను భరతుడును, ధూమ్రవస్త్రములను లక్ష్మణుడును, రక్త వస్త్రములను శత్రుఘ్నుడును, ధరించుట వారి స్వభావము. ప్రతిదినము ఆ నలుగురు రాజకుమారులు పుస్తకములు చేత బట్టి పాఠముల నేర్చుకొనుటకై గురువువద్దకు బోవుచుండిరి; అస్త్ర విద్య గూడ నభ్యసించిరి.

పదునొకండు సంవత్సరముల యీడువారయినప్పుడు నలుగురు రాజకుమారులకును చౌలోపనయన సంస్కారములు జరిగినవి. రక్తకౌశేయములు ధరించి వారు వసిష్ఠుని వద్దకు పోగా, అతడు యజ్ఞోపవీత ధారణ సంస్కారమును కావించెను. ఆనాటి నుండియు రాజకుమారులు బ్రహ్మచారులై పూర్వాచారము చొప్పున బంధుమిత్రుల వద్దకు బోయి, భిక్షము గొనుచు, దొరకిన యాహారమును గురువు వద్దకు దీసికొనిపోయి, భుజించుచు శీఘ్రకాలములో వేద వేదాంగములు, శాస్త్రములు పఠించిరి.

# IV

## విశ్వామిత్రుడు శ్రీరామునికై అయోధ్యకు వచ్చుట

విశ్వామిత్రుడను నొక మునీశ్వరుడు గలడు. అతడు క్షత్రియుడై జన్మించినను, తపోమహిమచేత బ్రాహ్మణుడయ్యెను. అతడు దశరథుని వద్దకు వచ్చి, "మహారాజా! ఇద్దఱు రాక్షసులు నా తపోవనమునకు వచ్చి, బ్రాహ్మణులను బ్రతుకనీయకున్నారు; యాగములు ధ్వంసము చేయుదురు. యజ్ఞ

మున కంతయు సిద్ధమై యుండగా వేదిపై రక్తవర్షము కురియింతురు; కనుకనో రాజా! ఆ రాక్షసులను సంహరించుటకు శ్రీరాముని బంపుము" అని యడిగెను.

ఆ మాటలకు దశరథుడు చాల చింతాక్రాంతుడై యుండెను. శ్రీరాము డతనికి ముద్దుకొడుకు; బాలుడు; కనుక రాక్షసులకు జిక్కి చచ్చునేమో యని భయపడెను. "అయ్యా! మునీశ్వరా! శ్రీరాముడు పసిబాలుడు. రాక్షసులతో నత డెట్లు యుద్ధము చేయగలడు? శ్రీరాముని పంపుమని మాత్రము కోరకుడు. కావలసిన యెడల నేనే వచ్చి యా రాక్షసులను సంహరించెదను" అని దశరథుడు చెప్పెను.

విశ్వామిత్రుడు, "మహారాజా! మమ్ము భాధించు రాక్షసులు మారీచుడును, సుబాహుడును సామాన్యులుకారు; రాక్షసుల రాజైన రావణుని పంపున వీ రిట్లు చేయుచున్నారు. ప్రచండబలుడైన రావణుని జంపగలవా? దశరథమహారాజా!" అని యడిగెను.

"అంత పరాక్రమశాలి యైన యా రావణుని జంపుట నాకు సాధ్యమా? ఇంద్రాది దేవతలైనను రావణు నోడింపలేరు గదా! దేవతల కసాధ్యమైనది పసిబాలుడైన నా కుమారున కెట్లు సాధ్య మగును! కనుక, ఓ మునీశ్వరా! నన్ను గరుణించి శ్రీరాముని బంపుమని కోరకుము" అని దశరథుడు మనవి చేసికొనెను.

విశ్వామిత్రునకు గోపము వచ్చినది. మహాముని యగు విశ్వామిత్రునకు గోపము వచ్చినందున నత డేమిచేయునో యని యచ్చటనున్న వా రందఱును భయపడుచుండిరి. అప్పుడు వసిష్ఠుడు లేచి, "దశరథమహారాజా! విశ్వామిత్రుని కోరిక నెఱవేర్పుము. శ్రీరాముని కే యాపదయు రాదు. అతనిని విశ్వామిత్రుడే రక్షించును. కావున రామునికై నీవు భయపడ బనిలేదు" అని ధైర్యము చెప్పెను.

ఆమాటలకు దశరథుడు సంతోషించి యనుమానము విడిచెను. విశ్వసింపదగిన తన గురువు, వసిష్ఠుడే శ్రీరామున కే యాపదయు గలుగనేర దని చెప్పు నప్పుడు తన కుమారుడు సురక్షితుడై యుండు నని దశరథునకు నిండు



నమ్మకము తోచినది. వెంటనే యా రాజు విశ్వామిత్రుని వంక దిరిగి, "మునీశ్వరా! మీ చిత్తము; శ్రీరాముని తోడ్కొని వెళ్లుడు" అని చెప్పెను.

శ్రీరాము డెందుండునో లక్ష్మణుడు నందే యుండును. వా రిరువురను దశరథుడు సభకు రావించి, ముద్దు పెట్టుకొని, విశ్వామిత్రున కొప్పగించెను. అందులకు మునీశ్వరుడు సంతసించి, దశరథుని సెలవు గైకొని వెడలునపుడు శ్రీరాముడును, లక్ష్మణుడును, ప్రయాణసన్నద్ధులై ధనుర్బాణములు చేత బట్టి విశ్వామిత్రు ననుసరించిరి.

## V

## తాటకను సంహరించుట

ఇట్లు బయలు వెడలి, శీఘ్రముగానే వారు ముగ్గురును సరయూనదీ తీరము జేరిరి. "శ్రీరామా! ఈ పుణ్య నదీ జలముల నొక్కమారు ముట్టుకొనుము; నేను మంత్రోపదేశము చేసెదను" అని, విశ్వామిత్రుడు శ్రీరామునకు రెండు మంత్రము లుపదేశము చేసి, "మంత్రముల నేర్చుకొంటివి గనుక, ని న్నెవడు నోడింపలేడు. నీవు నిద్రలో నున్నను రాక్షసులు నిన్ను బాధింపలేరు" అని చెప్పెను.

ఆ సరయూ తీరమును బట్టి పోయి పోయి, గంగానదీ తీరమునకు రాగా, అచ్చట పుణ్యశీలు రగు మునీశ్వరు లుండు పవిత్ర మైన యాశ్రమము ఒకటి కనబడినది. ఆనాటిరాత్రి వారు ముగ్గురును శుచివ్రతులైన ఋషీశ్వరులతో నుండి, మరునాటి యుదయము నావ యెక్కి యేఱు దాటిరి.

ఆవలి యొడ్డు చేరిన తోడనే భయంకర మగు కాఱడవి కనబడినది. అందు మారీచుని తల్లియైన తాటక యను రాక్షస స్త్రీ నివసించియుండెను. దానిని చూపించి సంహరింపు మని విశ్వామిత్రుడు శ్రీరామునకు జెప్పెను. స్త్రీహత్య మహాపాతక మని శ్రీరాముడు అనుమానించుచుండుట చూచి విశ్వామిత్రుడు, "వీరుడా! ఆడుదానిని జంపుట పౌరుషహీన మని తలంచుచుంటివా? ఆ రాక్షస స్త్రీ యతి క్రూరాత్మురాలు; అనేక మునులను జంపి భక్షించినది. దానిని జంపు టెంత మాత్రమును పాపకర్మము కాదు.’ అని చెప్పెను. అంతట శ్రీరాముడు ధనుష్టంకారము చేసి, యుద్ధమునకై తాటకను

పురిగొల్పెను. తాటక కోపావేశమున ఒడలు తెలియక పరుగెత్తుకొనివచ్చి శ్రీరాముని నెదిరించెను. అప్పుడు స్పష్టముగా కనబడినది తాటక ఎంత భయంకర మగు రూపము గలదో! మొట్టమొదట శ్రీరాముడు తన సహజకారుణ్యముచే దుష్టకర్మ మగు హత్య తలపెట్టక దానిని బెదరించి పంపివేయవలె ననియే చూచెను. దాని ముక్కును చెవులును, కొంచెము తెగునట్లు బాణములు వదలగా, తాటక ఏమైన భయపడెనా? ఒక్క క్షణములో దన రూపమును విడిచి అంతకంటె నెక్కువ భీకర మగు రూపము వహించి పెద్దపెద్ద బండఱాలను వర్షింప మొదలుపెట్టెను.

“ఆ తాటక నింకను జంపలేదా? వేవేగము సంహరింపుము; సాయంకాల మగుచున్నది. చీకటి పడిన కొలదిని దానికి బల మెక్కువగుచుండును” అని విశ్వామిత్రుడు కేక వేసెను. అప్పుడు శ్రీరాముడు అర్ధచంద్రాకారము గల యొక బాణమును తూణీరమునుండి తీసి, తన మీది కెగిరి వచ్చుచున్న యీ రాక్షస స్త్రీ వక్షస్థలమున నాటున ట్లేయగా, అది నేల గూలి, యొక క్షణములో జనిపోయినది.

అది చూచి విశ్వామిత్రుడు కడు సంతసించి, “బలె! శ్రీరామా! అనేకులను జంపి తినిన యీ పాపాత్మురాలిని సంహరించితివి! నిన్నెల్లవారును మెచ్చుకొందురు” అని స్తోత్రము చేసెను.

## VI

## మారీచుడును, సుబాహుడును

మఱునాటి యుదయము విశ్వామిత్రుడు నానా విధము లైన దివ్యాస్త్రములను శ్రీరామునకును లక్ష్మణునకు నిచ్చెను. అటుపిమ్మట వారు ముగ్గురును నడిచిపోవుచుండగా నొక పర్వత మగపడినది. అది యొక గొప్ప మేఘమువలె నాకాశ మంటుచు గడు నెత్తుగా నుండెను.

“అదిగో! ఆ పర్వతము సిద్ధాశ్రమము. అచ్చట నున్న బ్రాహ్మణులను మారీచ సుబాహులు పీడించుచున్నారు.” అని విశ్వామిత్రుడు చెప్పెను.

కొంతసేపటికి వా రా యాశ్రమమును బ్రవేశించిరి. అచ్చటి ఋషీశ్వరులు వారికి స్వాగత మొసగి, విశ్వామిత్రున కర్ఘ్య పాద్యము లిచ్చిరి. ఆ రాత్రి



విశ్వామిత్రునితో రాజకుమారులును అందు విశ్రమించి, మఱునాటి రాత్రి రాక్షసులకై ప్రతీక్షించుచుండిరి. ఇట్లు ఐదు రాత్రులు గడచినవి. ఆఱవనాటి రాత్రి హోమకుండమున నగ్ని జ్వలించుచుండగా, ఆకాశమున నిద్దఱు రాక్షసులు కనబడిరి. వేదిపై వారు రక్తవర్షము గురియింపగా, శ్రీరాముడు తన వింటిని చేత బట్టి, “తమ్ముడా! ఇట్టి దుష్టులను చంప నిష్టము లేదు. మేఘములను గాలి చెదరగొట్టునట్లు వారిని చెదరగొట్టి పాఱదోలెదను” అని చెప్పెను.

అప్పుడు మారీచుడు గాలిలో నెగురుచుండెను. వానికి నీలమేఘశ్యాముడైన శ్రీరాముడును, వాని చెంత నున్న లక్ష్మణుడును, కనబడిరి. శ్రీరాముని చేత నున్న వింటిని జూచియు, భయము చెందక మారీచుడు దిగ్గన దిగి, బ్రాహ్మణులను బట్టి చంప నారంభించెను.

ఆ దౌర్జన్యమునకు శ్రీరాము డత్యంత కోపాకులుడై మారీచుని వక్షస్థలమును దూసికొనిపోవున ట్లొక బాణము నేసెను. ఆ బాణప్రహారమునకు మారీచుడు గాలిలో దూరముగా నెగిరిపోయి, సముద్ర మధ్యమున బడెను. పిమ్మట తూణీరమునుండి మఱి యొక బాణమును దీసి సుబాహునిపై నేయగా నాస్థూలదేహుడైన రాక్షసుడు వెంటనే నేల గూలి చచ్చెను.

మారీచు డెగిరి పోవుటయు, సుబాహుడు నేల గూలుటయు జూచి, సిద్ధాశ్రమమున నున్న ఋషు లందఱును కడు సంతోషించి, కృతజ్ఞులై, రామలక్ష్మణులను విశేషముగా బ్రశంసించి యాశీర్వదించిరి; విశ్వామిత్ర మహర్షిని గొనియాడి పూజించిరి.

## VII

## మిథిలా ప్రయాణము

విదేహరాజ్యమునకు మిథిలానగరము రాజధాని. అందు జనకుడు రాజ్యపరిపాలనము చేయుచుండెను. అతనివద్ద నద్భుత మైన యొక విల్లుగలదు. అది దివ్యాయుధము; సామాన్య జనులు ఎత్తి వంచుటకైన సాధ్యము కానంత భారము గలది.

విశ్వామిత్రుడు తన యాశ్రమము విడిచి రామలక్ష్మణులను మిథిలానగరమునకు దోడ్కొని పోయెను. బయలుదేరిన నాటి సాయంకాలమునకు శోణ

నదీతీరమును జేరి, అందా రాత్రి వారు ముగ్గురును విశ్రమించిరి. అక్కడ విశ్వామిత్రుడు రాజకుమారులకు గంగోపాఖ్యానము జెప్పెను. ప్రబలమైన యీ మహా ప్రవాహము హిమవత్పర్వతమునుండి యవతరించిన విధమును, ఆ నదీతోయములు విశాలముగా విస్తరించిన పుణ్యభూములందు పటురవమున ప్రవహించి సముద్రమును జేరిన విధమును వివరముగా వర్ణించి చెప్పెను.

మఱునాటి యుదయమున వారు శోణ నది దాటి పోయి పోయి, ప్రమతిరాజు పాలించుచుండిన విశాలా నగరము ప్రవేశించిరి. ఆ రాజుదర్శనము చేసి మరల తమ మార్గము ననుసరించి పోవగా బోవగా, తుదకు సుందరమైన యీ మిథిలానగరము కనబడినది.

అప్పు డా నగరమున జనక మహారాజు గొప్ప యజ్ఞ మొకటి చేయుచుండెను. వేనవేలు బ్రాహ్మణులు నానా దేశములనుండి వచ్చియుండిరి. వందలకొలది శకటములు వివిధోపకరణములతో నిండియుండెను.

విశ్వామిత్రుడు మిథిలకు వచ్చు టెఱిగి, అతనికి స్వాగత మొసగుటకై జనకుడు సన్నద్ధుడై యుండెను. "ఆ మహాముని నా యజ్ఞమునకు వచ్చి నాగృహము పావనము చేయుటచే నే నెంతయు కృతార్థుడ నైతి" నని చెప్పు నంతలో విశ్వామిత్రు డగపడెను. జనకుడు తోడనే లేచి, చేతులు జోడించి నమస్కరించి, అచ్చట నున్న ఋషుల ముందర నొక యుచితాసనమున అతనిని కూర్చుండబెట్టెను. జనకునకు గురువైన శతానందుడును, విశ్వామిత్రునకు సత్కారము చేసెను.

"మునీశ్వరా! మీతో వచ్చిన ఈ యిద్దఱు రాజకుమారు లెవ్వరు?" అని జనక మహారాజు విశ్వామిత్రుని అడిగెను.

"మహారాజా! సుందరాకారు లైన ఈ బాలురు దశరథ మహారాజు కుమారులు" అని చెప్పి, వా రిరువురును రాక్షసులను చంపిన విధ మంతయు వర్ణించెను. అందులకు జనకుడు చాల సంతోషించి వారి నుచితాసనమున కూర్చుండబెట్టి, "మీ రాకచే గడు ధన్యుడ నైతి" నని చెప్పెను. జనకునింట నున్న యీ యద్భుతమైన బాణాసనమును శ్రీరాముడు చూడ వేడుక గలవాడని విశ్వామిత్రుడు ప్రసంగవశమున జనకునికి దెలియజేసెను.



# VIII

## సీతా కల్యాణము

మఱునాటి యుదయమున జనక మహారాజు కొలువుకూటమునుండి విశ్వామిత్రుని రామలక్ష్మణులను తన వద్దకు రావించెను. వారు ముగ్గురును వచ్చి సుఖాసీనులై యుండగా, "మునీశ్వరా! మీ కేమి కావలయును?" అని జనకు డడిగెను.

"మీ యింట నున్న యీ యద్భుతమైన వింటి నీ యిరువురు రాజకుమారులును జూడ వేడుచున్నారు గనుక, జనకమహారాజా! ఆ బాణాసనమును దెప్పింపుము" అని విశ్వామిత్రుడు ప్రార్థించెను.

జనకు డందులకు సమ్మతించి ముందుగా నా వింటిని గూర్చి కొంత మట్టుకు ప్రసంగించెను. మొదట దేవతల దైన యీ విల్లు తనకు దొరికిన విధమును వర్ణించి చెప్పెను.

యజ్ఞమునకై యొక చోటు నియమించి యచ్చట దున్నించుచుండగా, కఱ్ఱు తగిలి, భూమినుండి వెల్వడి, నాగటి చాలున నొక బాలిక పొడచూపినది. ఆ శిశువును జనకుడు తన మందిరమునకు దీసికొని పోయి, పెంచుచుండెను. నాగటి చాలున దొరికిన దగుటచే నామెకు సీత యని పేరు వచ్చినది. 'సీత' యనగా '(నాగటి) చాలు'

నా నాటికి పెరిగి పెద్దదై సీత యిప్పుడు నిరుపమాన యువతీరత్న మయ్యెను. ఆమె రూపలావణ్యములను జూచి అనేక రాజకుమారు లామెను వివాహ మాడదలచిరి. అది యెఱిగి జనకుడు, "ఏవీరుడు నాయింటనున్న యీ దివ్యధనువును వంచునో యా వీరునకే సీత నిచ్చి, వివాహము చేసెద" నని కృతసంకల్పుడై యిట్లు ప్రకటించెను. అనేక రాజకుమారులు వచ్చి యీ వింటిని వంచబోయిరి గాని, ఎవనికిని సాధ్యము గాలేదు.

ఇట్లు జనకుడు వింటినిగూర్చి ముందుగా జెప్పి, "శ్రీరాముడు దానిని వంచినయెడల, తప్పక నా కుమార్తె యైన సీత నతని కిచ్చి వివాహము గావించెద" నని చెప్పెను.

అంతలో సేవకులు బాణాసనమును తీసికొనివచ్చి యెదుట నుంచిరి.

మిక్కిలి పెద్దదియు, కడు బరువైనదియు నగుటచే, ఎనిమిది చక్రముల బండిపై దాని నుంచి, ఆ బండిని లాగి తెచ్చిరి. దానిని జూచి విశ్వామిత్రుడు, "శ్రీరామా! ఆ బండిలోనుండి దానిని తీసి వంచగలవేమో చూడుము" అని చెప్పెను.



రాముడు హరువిల్లు విఱుచుట.



శ్రీరాముడు మెల్ల మెల్లగా బండివద్దకు బోయి వింటిపై నొక చేయి వేసి సులభముగా బైకెత్తి కొంతసేపు దానిని బరీక్షించుచుండెను. అటు పిమ్మట దాని నెడమచేతను బట్టి యందఱు కగపడునట్లు మీది కెత్తి చూపించెను. తర్వాత వింటికి నారి తగిలించి యెడమచేతితో ధనువును బట్టి కుడిచేతి రెండువ్రేళ్లతో నారిని లాగగా, అంత బలభారములు గల విల్లును పళ పళమని నడిమికి విఱిగి ముక్కలయినది.

అది చూచి యెల్లవారును విస్మయానందభరితులైరి. "శ్రీరాముని బలపరాక్రమములగూర్చి వింటిని గాని, అతడైనను దీనిని వంచునని నేను తలపకుంటిని. నా సంకల్పము చొప్పున నా ముద్దుకూతురైన సీత యింక శ్రీరాముని భార్యయే యగును" అని జనకుడు పలికెను.

ఈ సంతోష వార్త దశరథునకు దెలిసి, అతడును, శీఘ్రముగా మిథిలకు వచ్చెను. కన్నెలలో మిన్నయు, సకల సద్గుణసంపన్నయు నగు సీతకును, వీరులలో వీరుడును, పురుషసింహమును నగు శ్రీరామునకును, వివాహము జరిగినది. ఆ సమయమునందే శ్రీరాముని తమ్ములకును వివాహములయినవి. సీత చెల్లెలైన ఊర్మిళను లక్ష్మణుడును, జనకుని సోదరుని కుమార్తెలను భరతశత్రుఘ్నులును పెండ్లి చేసికొనిరి.

వివాహకాలమున సకలాభరణభూషిత యైన సీతను జనకుడు కల్యాణమంటపమునకు తీసికొనిపోయి, అగ్నిహోత్రుని యెదుట నిలువబెట్టి, ఆమె కుడివైపున నున్న శ్రీరామునితో, "శ్రీరామచంద్రా! ఇదిగో సీత! ఈమెను చేపట్టుము. నీ నీడవలెనే నిన్ను విడువక ఈమె నీ ప్రక్కనే యెప్పుడు నుండును" అని యా వధూవరులపై తీర్థోదకము చిలికి మార్జనముచేసెను. అట్లే భరతలక్ష్మణశత్రుఘ్నుల వివాహములును జరిగినవి.

ఆ రాజకుమారులలో నొక్కొక్కడు తన భార్యచేయి పట్టికొని అగ్నిహోత్రమునకును, జనక దశరథులకును, ఋషీశ్వరులకును ప్రదక్షిణము చేసి నమస్కరించిరి. ఇట్లు మహావైభవముతో వివాహ మహోత్సవములు సంతోషకరముగ సమాప్తమైనవి.

# IX

## పరశురాముడు

దశరథ మహారాజును అతని నలుగురు కొడుకులును నలుగురు కోడండ్రును బయలుదేరి, అయోధ్యకు మరలి వచ్చుచుండిరి. త్రోవలో, ఆకాశమున మబ్బు క్రమ్మి యంతటను నల్లగా పొగ యల్లుకొన్న ట్లుండెను. వడివడిగా పెనుగాడ్పు వీచినది. ఝుంఝామారుతమునకును పెనుధూళి రేగినది. సూర్యు డదృశ్యు డయ్యెను. అచ్చెరువొంది అందఱు జూచుచుండగా యముని వలె భయంకరాకారుడును, ఇంద్రునివలె పరాక్రమశాలియు నైన యొక పురుషుడు వాయుమార్గమున వచ్చుచు నగపడెను. దీప్తిమంతమగు కవచమును ధరించి, భుజమున నొక పెద్ద కుఠారమును వైచికొని, చేత వింటిని బట్టి, అతడు పొడచూపెను. అతడు జమదగ్ని కుమారుడు; పరశురాము డని ప్రఖ్యాతి వడసినవాడు. బ్రాహ్మణు డైనను గొప్ప వీరుడు. కొన్ని సంవత్సరముల క్రిందట పరమభక్తుడును, ఋషీశ్వరుడును ఐన యితని తండ్రిని అవినీతుడగు నొక రాజు చంపెను. పరశురాముడు తండ్రి యాశ్రమమునకు వచ్చి దుష్టక్షత్రియు డొనర్చిన మహాపాతకమును జూచి, క్రోధావేశముచే, తనకు గనబడిన క్షత్రియుల నెల్లరను జంపుటకు నిశ్చయించుకొనెను. రవ్వంత యైనను కరుణలేక అనేకమంది క్షత్రియులను జంపి, శ్రీరాముని కూడ జంపదలచి అత డిప్పుడు వచ్చెను. వసిష్ఠుడును తక్కిన ఋషులును పరశురాముని నెఱుగుదురు. అత డెంత పరాక్రమవంతుడో వారికి బాగుగా దెలియును. అతనిని జూచిన తోడనే వారందఱును భయపడి, పరశురాముని మనసు శమింప జేయుటకై మంచిమాటలాడ నారంభించిరి. "ఓహో! పరశురామా! మీ విజయయాత్ర సుఖప్రదముగా నున్నదా? మహానుభావా! ఇదుగో! అర్ఘ్య మిచ్చుచున్నాము; కైకొనుము. క్షత్రియులను చాల మందిని సంహరించినాడవు. ఋషీశ్వరా! నీ కోపము చల్లారినది కదా! మమ్ము కరుణింపుము" అని వారు సవినయముగా మనవిచేసిరి.

వారిచ్చిన అర్ఘ్యమును పరశురాముడు గైకొనెను; కాని, ఋషులాడిన మాటల కేమియు ప్రత్యుత్తర మియ్యకుండెను. అతడు శ్రీరాముని



వంకకు దిరిగి, "ఓహో! శ్రీరామా! నీ ప్రఖ్యాతి విని యున్నవాడను. జనకు నింట నున్న శివుని వింటిని విఱిచితి వని కూడ తెలిసినది. అంత పరాక్రమశాలి వని తెలియుటచేతనే నిన్ను జూడ వచ్చితిని" అని చెప్పెను.



పరశురాముడు శ్రీరాముని నెదిరించుట

దశరథుం డా మాటలు విని తన కుమారున కేమి యాపద సంభవిం
చునో యని భయపడి, "మహానుభావా! ఋషీశ్వరా! నీవు విరాగివై ఆ
యుధములను విడిచియుంటివి; మరల క్షత్రియులతో యుద్ధము చేయ
జూచుచున్నా వేమి? నన్ను గరుణింపుము; నా ముద్దుకుమారుడైన శ్రీరా
ముని జంప దలపకుమా" అని ప్రార్థించెను.

దశరథుని మాటలు లక్ష్యము చేయక శ్రీరాముని వైపు పారజూచుచు,
"ఓయీ! క్షుద్రుడా! ఈ వింటిని పుచ్చికొని, దీనిని వంచిన యెడల నీతో
యుద్ధము చేసెదను. ఈ విల్లును, నీవు విఱిచిన ఆవిల్లును, లోకమున ప్రసిద్ధి
గాంచినవి. ఈ రెంటిలో నావిల్లే యెక్కువ బలమైనది. కనుక నా విల్లు
విఱువ గలవేమో చూడుము," అని చెప్పెను.

శ్రీరాముడు తన తండ్రి భయపడునేమో యని తలచి కొంతవఱకు
శాంతి వహించియుండెను; కాని, పరశురాముని ప్రగల్భ వచనములు
సహింపలేక, "పరశురాముడా, నీ వొనరించిన ఘనకార్యములు నేనును
విన్నాను. క్షత్రియ వంశములను చాల మట్టునకు నిర్మూలము చేసితివి గాని,
అంత మాత్రమున నీవు గర్వింపకుము. నీచే జచ్చిన క్షత్రియవీరులు బల
హీనులు. ఏదీ! నీచేతి విల్లు ఇటు దెమ్ము." అని పరశురాముని చేత నున్న
బాణాసనమును దీసికొని, చిరునవ్వు నవ్వుచు నొక కోల దానికి సంధానము
చేసి, నారిని బట్టిలాగెను. బాణమును వదలుటకు సన్నద్ధుడై, "బ్రాహ్మణ
వీరుడా! నిన్ను జంపుట మహాపాతకము గనుక, నీమీదికి బాణమును వద
లను. నీయందు గల శక్తులను గైకొందును. అని చెప్పెను. శ్రీరాముని పరా
క్రమమును జూచి తనకంటె నతడే యెక్కువ బలవంతు డని తెలిసికొని,
బాణము నేయకు మని బ్రతిమాలుకొనెను. ఆమాటలు లక్ష్యము చేయక
బాణము వదలి పరశురాముని శక్తు లన్నియు గైకొనెను.

పిమ్మట పరశురాముడు శ్రీరాముని యెడల వినయము గలవాడై యతని
చుట్టును ప్రదక్షిణము చేసి నమస్కరించి వెడలిపోయెను. వెంటనే ఆకాశ
మున మేఘములు చెదరిపోయి సూర్యుడు దేదీప్యమానుడై, ప్రకాశించుచుం
డెను. దశరథుడును అతని కుమారులును మరల తమ దారిని పోయిరి.



## X

## దశరథుడు శ్రీరాముని యువరాజుగా నియమించుట

దశరథుడు కొడుకులతోను, కోడండ్రతోను సురక్షితముగా అయోధ్య
చేరెను. అతని భార్యలు సంతోషముతో వారికి స్వాగత మొసగిరి. ఆ నూతన
దంపతులకును నానాటి కనురాగము హెచ్చుచుండెను. వారిలో శ్రీరాము
నకును సీతకును గల యనురాగము మఱి యే దంపతులకును గలుగ నేరదు.

దంపతుల గృహప్రవేశ సమయమున కైకేయి సోదరుడు అయోధ్యలో
నుండెను. కొన్ని దినములు కడచిన పిమ్మట నతడు తన రాజ్యమునకు వెడల
నుద్యుక్తుడై యుండగా దశరథుడు భరతుని బిలిచి "నాయనా! నీ మేన
మామ తన దేశమునకు బోవ నాయత్తుడై యున్నాడు. నిన్ను బంపుమని
కోరుచున్నాడు. నీవు అతనితో బోయి నీ మాతామహుని నొకసారి చూచి
రమ్ము" అని చెప్పెను. తండ్రి యాజ్ఞ శిరసావహించి భరతుడు తన మేనమా
మతో బితామహుని రాజధాని యైన రాజగిరికి బోయెను. అతనితో గూడ
శత్రుఘ్నుడును వెడలెను. రామలక్ష్మణులు వారిని నగరము దాటువఱకు
దంపకము పెట్టిరి. నగర బహిర్ద్వారమున నిలిచి, అన్నదమ్ములు ఒకరి నొకరు
కౌగిలించుకొనిరి. శ్రీరాముడు భరత శత్రుఘ్నులను జూచి, "తమ్ములారా!
నన్ను మఱవకుడు. నేనును, లక్ష్మణుడును, మిమ్ము దినము స్మరించుచుందుము"
అని చెప్పెను. రామలక్ష్మణు లంతట వారిని విడిచి, భ్రాతృ వియోగమునకు
గొంత చింతిల్లి, నగరమునకు మరలి వచ్చిరి.

శ్రీరాముడు తల్లిదండ్రుల యెడల భక్త్యనురాగములు గలవాడు;
తండ్రి యాజ్ఞ శిరసావహించుచు నతని నెల్ల వేళల రంజింపజేయువాడు.
బ్రాహ్మణుల యెడల గౌరవము గలవాడు. పౌరు లందఱును శ్రీరాముని
జూచి అత్యంతానంద భరితులై, "పరాక్రమవంతుడైన శ్రీరాముడే పురుష
సింహు డని" చెప్పుకొనుచుండిరి.

శ్రీరాముడు సీత కనుకూలుడైన భర్త. అనుకూలమైన దాంపత్యముచే
వా రిరువురును చాల సుఖముగా నుండిరి. శ్రీరాముడు సీతకు హృదయేశ్వరుడు;
సీత శ్రీరామునకు హృదయేశ్వరి. అతడు ఏకపత్నీవ్రతుడు. ఆమె పరమపతి

వ్రత. సీత తన యంతరంగమందలి తలంపుల నన్నిటిని తన భర్తకు దెలియజేయును. అతని యెడల నామె కంత ప్రేమ; అంత నమ్మకము.

దశరథుడు కుమారు లందఱి యెడల వాత్సల్యము కలవాడే, కాని శ్రీరామునిపై నతనికి నెక్కువ యనురాగము గలదు. శ్రీరాము డతనితో పరిచయము కలవారి కందఱికి సంతోషము కలుగజేయుచుండెను. పిన్న పెద్ద లందఱితో నొక్క లాగుననే మనోజ్ఞముగా మాట్లాడుచుండెను.

తనను దూషించినవారి యెడల కాఠిన్యము వహింపడు. జను లందఱు తనను బొగడుచుండినను, ఉబ్బడు, గర్వింపడు; పరుల క్షేమమును దలపోయువాడు; దీనుల యెడ దయ గల్గి వారి నానందింపజేయువాడు; ఉదారుడు; స్థిరబుద్ధి గలవాడు; ఏనా డొనరింపవలయు కృత్యములు ఆనాడే అతడొనరించుచుండును గాని, మఱునాడు కావింపవచ్చు నని తామసము చేయువాడు కాడు.

అయోధ్యయందలి ప్రాజ్ఞు లందఱు శ్రీరాముని సుగుణములు బాగుగా నెఱుగుదురు. అందుచే వారు దశరథుని యొద్దకు బోయి, "మహారాజా! మీరు వృద్ధులైనారు. శ్రీరాముని నిక యౌవరాజ్యమున కభిషిక్తుని జేయుదురు గాక!" అని విన్నవించిరి.

రాజునకు వారి విన్నపము మంచి యుపదేశము వలె దోచినది. అనేక రాజులను రాజకుమారులను రావించి, శ్రీరాముని యువరాజుగా జేసెద నని దశరథుడు చెప్పెను. అందులకు వా రందఱు చాల సంతోషించిరి. వారికి శ్రీరాముని మీద మెండుగా ననురాగమును, అతడు యువరాజ పదవికి దగినవా డని చాల నమ్మకమును గలదు. అయోధ్యయందలి పౌరులును శ్రీరాముడు యౌవరాజ్యాభిషిక్తు డగు నని చాల సంతోషించిరి. ఈ శుభవార్త శీఘ్రముగా పట్టణమంతయు వ్యాపించినది.

పిమ్మట దశరథు డొకనాడు వసిష్ఠుని రప్పించి మఱుసటి దినము శ్రీరాముని యౌవరాజ్యాభిషేకము జరుగును గనుక వలయు ప్రయత్నములు గావింపవలయు నని చెప్పెను. శ్రీరాముని బిలిచి, "ఱేపకడ జరుగు సంస్కారమునకు సన్నద్ధులై యుండవలయును గావున నీవును సీతయు నేటి రాత్రి భుజింప



రాదు; రాతిపై తలనిడుకొని, కుశాస్తరణమున శయనింపవలయును" అని సెలవిచ్చెను.

ఈ వార్త శ్రీరాముడు తన తల్లి కెఱిగింపగా నామె హృదయమున సంతోషము పొంగ, సాటోపముగా కుమారుని గాగిలించుకొనెను. పౌరులందఱు శ్రీరాము డిక తమకు రా జగును గదా యని అత్యంతానందభరితులై వీథులను వేవిధముల సింగారించి వారి సంతోషము వెల్లడిజేసిరి.

## XI

## దుష్ట మంధర

రాజమందిరమున మంధర యను నొక ముదుసలి దాసి గలదు. అది కడు దుష్టురాలు. దాని దేహము వలెనే దానిమనస్సును వంకర టింకరగా నుండును.

ఆ మంధర కైకేయి పరిచారిక. ఆమె కొలువులో నుండి మిగుల నమ్మ దగినదైనది. వక్రాంగియైన యా దుష్టమంధర మేడపైనుండి పట్టణమున పౌరులు గావించు సింగారమును జూచి అంత సందడి కలుగుటకు గొప్ప ఉత్సవ మేదో యొకటి జరగవలె నని యూహించినది. మంగళవాద్యములు వినబడుచుండెను; సంతోషమును తెలియ జేయుచు పౌరులు కేకలు వేయుచుండిరి. ధూళి రేగకుండ వీథుల నీళ్లు చల్లి తడుపుచుండిరి; పౌరులు స్నానములు చేయుటకై తీర్థములకు బోవుచుండిరి. పశువులు సైతము తమ సంతోషమును వెల్లడి జేయునట్లు అఱచుచుండెను. ఆ యుత్సాహమునకు గారణము దెలిసికొని ఆదాసి కోపముచే గన్ను లెఱ్ఱజేసి కైకేయియొద్దకు బరుగెత్తి పోయినది.

"అయ్యో! ముద్దరాలా! లేలెమ్ము! ఏమి? నిద్రబోవుచున్నావా! వేసవికాలమున నదీప్రవాహము వలెనే నీ భాగ్య మిక నడుగంటిన దని తెలియదుగా?" అని మంధర కైకేయితో జెప్పెను.

"మంధరా! ఏమీ అంత కుపితురాలవై యున్నావు? ఏల అట్టి చెడుమాట లాడెదవు? శాంతింపుము. శాంతింపుము. ఏదైన సంతోష వార్త చెప్పుము." అని కైకేయి కడు మృదువుగా బలికినది.

"అయ్యో! ఎంత వెఱ్ఱిబాగులదాన వమ్మా! నీ మీద నీ మగని కెంత

మక్కువయో చూచితివా? ఆనాడు భరతుని పంపించివేసెను గదా? ఈనాడు శ్రీరాముని యౌవరాజ్యాభిషిక్తుని జేయుచున్నాడు! ఎంతకుట్రో చూడు!" అని మంధర జెప్పినది.

తోడనే కైకేయి దిగ్గన లేచినది. అప్పు డామె మోము సముద్రము నుండి ఉదయించుచున్న శరచ్చంద్రుని వలె ప్రకాశించుచుండెను. "సెబాస్. మంధరా! ఎంత సంతోషకర మైన వార్త తెచ్చితివి! ఇంత కంటె నా కేమి కావలయును? ఇందుకై బహుమతిగా ఈ యాభరణము గైకొమ్ము" అని తన దండకడియములను దీసి యా దుష్టమంధర కిచ్చి, "మంధరా! శ్రీరాముడు మహారాజునకు జ్యేష్ఠపుత్రుడు, కదా! వానికంటె మఱి యెవడు యువరాజ పదవికి దగినవాడు"? అని యడిగెను.

మంధర పెడమొగము బెట్టినది. ఇచ్చిన వస్తువులు తీసికొనలేదు. "చాలు, చాలు, నీ తెలివి తక్కువ. నీ యవివేకమునకు నాకు నవ్వు వచ్చుచున్నది. నీ సవతికి నీకంటె నెక్కుడు భాగ్యము కలిగిన దని సంతోషించుచున్నావుగా! కౌసల్య మహారాజునకు ప్రియమైన భార్య గాకపోయినను, ఆమె కుమారుడు యువరాజు కానున్నాడు! ఇక నామె రాజమాత యగును గదా! ఇక నీవో, చేతులు జోడించి కౌసల్య యెదుట దాసివలె నిలువబడవలెను. నీ కుమారుడు శ్రీరామునకు బంటువలె నుండవలెను." అని ముందలించినది.

"కుటిలాంగి వగుటచేత నీ కుటిల స్వభావమును విడువవు గదా? నీ మాట లిక కట్టిపెట్టుము" అని కైకేయి చెప్పినది; కాని, మంధర చెప్పిన మాటలు మనస్సున బాగుగా నాటియుండెను. వాని నెంత మఱవ దలచినను అవి యామె జ్ఞప్తికి వచ్చుచునే యుండెను. అదివఱకా రాణి యెంత హాయిగాను సంతోషముగాను ఉండెనో ఇప్పు డంత చింతాక్రాంతయై యుండెను. కుటిలాంగియైన యా మంధర దుర్బోధన కైకేయి మనసులో నాటి మొలకెత్తినది. క్రమముగా శ్రీరామునిపై నామెకుగల యనురాగము పోగొట్టి ద్వేషము కలిగించి తుద కతనిని అయోధ్యనుండి వెడలగొట్టుటకే ఆమెకు బుద్ధిపుట్టించినది.

అప్పటికి గొన్ని సంవత్సరములయి దశరథ మహారాజు జ్వరపీడి



తుడై యుండెను. అతనికి దన ప్రియభార్య యైన కైకేయియే ఉపచారము గావించుచుండెను. దానిచే దశరథ మహారాజు ప్రీతుడై "ప్రాణేశ్వరీ! నీ యుపచారమునకు గడు సంతసించితిని. రెండు వరములు కోరుకొమ్ము; నీకు వానిని దప్పక నిచ్చెదను." అని యొకనాడు చెప్పెను. అదివఱ కెన్నడును కైకేయి యే కోరికను కోరియుండలేదు. భర్త యనురాగమునకు ఆమె యానందము జెంది మంచి దని యప్పటి కూరకుండెను. ఇప్పు డా వరముల సంగతి మంధర ఆమె జ్ఞప్తికిదెచ్చి, శ్రీరాముని అరణ్యమునకు బంపవలయు ననియు, భరతుని యౌవరాజ్యాభిషిక్తుని జేయవలయు ననియు, కైకేయి దశరథ మహారాజును కోరునట్లు చేసినది.

## XII

## కైకేయి కూడని కోరికలు కోరుట

దశరథ మహారాజునకు కైకేయిపై మక్కువ మిక్కిలి ఎక్కువ. అతడు స్వయముగా కైకేయి యొద్దకు బోయి, శ్రీరాముని యౌవరాజ్యాభిషేకమును గూర్చి చెప్పదలచెను. శ్రీరామునిపై దక్కిన రాణులకువలె కైకేయికిని వాత్సల్యము గలదు, కావున ఆమె కడు సంతోషించునని దశరథు డనుకొనెను. కాని మంధర యొనరించిన కీడు అతని కేమియు దెలియదు.

కైకేయి మందిరము దశరథుడు ప్రవేశించి చూడగా నం దెవ్వరును లేరు. "కైకేయి ఏదీ? ఎక్కడ నున్నది?" అని దశరథు డడిగెను. ఆమె క్రోధాగారమున నున్న దని పరిచారికలు చెప్పిరి. "ఏమి! కైకేయి కోపగృహమున నున్నదా? ఆమె కోపమునకు గారణమేమి?" అని విచారించుచు దశరథుడు కైకేయి వద్దకు బోయి ఆమె నూఱడింప దలచెను. ఆమె యేమి కోరినను, ఇచ్చి, సంతోషపెట్ట వలయు ననియే నిశ్చయించుకొనెను. ఆమె దుఃఖముతో నుండగా, చూచి దశరథుడు సహింపగలడా?

దశరథుడు కోపగృహము ప్రవేశించి చూడగా, కైకేయి జుట్టు విరబోసికొని కటికినేలపై పరుండెను.

"ఏమిది? ప్రాణేశ్వరీ! నీ కేల ఇంతకోపము? లే లెమ్ము. నీ కేమి కావలయునో కోరుకొనుము. నీ కోర్కె తప్పక నెఱవేర్చెదను" అని దశరథుడు చెప్పెను.

అంత కైకేయి మోము పైకెత్తకయే, "నాకొక కోర్కె యున్నది: దానిని నెఱవేర్చెదరా?" అని యడిగెను.

దశరథ మహారాజు, కైకేయి ముంగురులు సవరింపుచు, "ప్రాణే



అలిగిన కైకేయిని దశరథుడు ఓదార్చుట.



శ్వరీ. నీ మీదను శ్రీరాముని మీద నున్నట్టే, నాకు ప్రేమ మెండుగా గలదు. మీ యిద్దఱికంటె నాకు మఱి యెవరును ఎక్కువ ఇష్టులైనవారు లేరు, కనుక కైకేయీ ! నీ కోర్కె యేమో చెప్పుము. అది తప్పక నెఱవేర్చెదను నామాట నమ్ముము" అని బ్రతిమాలుకొనెను.

అంత నా కైకేయి యా వృద్ధ మహారాజునకు గర్వకఠోరముగా తన కోర్కె తెలియజేసినది: "భరతుని యువరాజుగా జేయుడు. శ్రీరాముని దండకారణ్యమునకు బంపుడు. అతడు పదునాల్గు సంవత్సరములు వనవాసము సేయవలెను. కొంతకాలము క్రిందట మీరు నాకు రెండు వరములు దయచేసి యుంటిరి. అవి నే నిప్పుడు కోరుకొనుచున్నాను" అని కైకేయి చెప్పినది.

కొంతవఱకు దశరథునకు కైకేయి మాటల యర్థము బాగుగా బోధపడలేదు ; అతడు నిశ్చేష్టుడై యుండెను. పిమ్మట కొంత సేపటికి, అతడు కైకేయి కోర్కె తెలిసికొని కోపము పట్టలేక, "దుష్టాత్మురాలా ! ఇదియా నీ కోర్కె ? నా వంశము నిష్కారణముగా నశింపజేయ దలచుకొన్నావా యేమి? శ్రీరాముడు నీ కేమి యపచారము గావించినాడు. అతనికి మోస మేల తలంచుచున్నావు? ఒక గొప్ప మహారాజునకు గూతురవై పుట్టియు నా మందిరము దుష్టసర్పము వలె బ్రవేశించితివా ? నా ప్రాణముల నైనను విడనాడుదును గాని నీవు చెప్పినట్లు చేయనోడుదును" అని చెప్పెను.

ఆ మాటలకు కైకేయి హృదయము ద్వేషముతో బూర్ణముగా నిండి యుండెను. "మహారాజా! నాకు వరముల నిచ్చినందులకు విలపించుచున్నావేమి? ఇట్లు విలపించుటచే నిక ప్రజల యాదరమునకు నీ వెంతమాత్రమును పాత్రుడవు గావు. ఆడిన మాట దప్పిన మోసకాడవు. పో పొమ్ము. కౌసల్య యొద్దకు వెళ్లుము. నీ యిష్టము, శ్రీరాము నే యౌవరాజ్యాభిషిక్తుని జేసికొమ్ము. కాని, నా ప్రాణము పోయినను సరే, కౌసల్య యెదుట చేతులు జోడించి నే నెంతమాత్రమును నిలువబడవలసిన దాననుగా నని దెలిసికొమ్ము. నీ ప్రతిజ్ఞా భంగమునకు దుఃఖించి ప్రాణములు విడుతు నని నమ్ముము. మహారాజా ! ఇదిగో నా శాపముచే నీవు నశింతువు. భరతునకు నీవు కీడు దలచినందులకు నీకు హాని కలుగక పోదు" అని కైకేయి కఠినవచనము లాడినది.

ఆ కర్ణకఠోరము లగు మాటలకు దశరథుని హృదయము బ్రద్దలైనది. తా నదివఱకు చేసిన వాగ్దానము జ్ఞప్తికి దెచ్చుకొని ప్రతిజ్ఞా భంగమునకు



కైకేయిని దశరథుడు బ్రతిమాలుట

వెఱచి, కైకేయి కోర్కె నెఱవేర్పక తప్పదు గదా యని కడు దుఃఖించుచు, "అయ్యో! రామా! రామా!" యని మూర్ఛిల్లి నేలపై బడెను.

అచ్చట ద్రొల్లుచు వెక్కి వెక్కి యేడ్చుచు దశరథుడు జడ్డివాని వలె



నుండెను. అప్పు డతని మొగమున జీవకళయే లేదు. కొంత సేపటికి నతడు మూర్ఛనుండి తెలిసి "అయ్యో కైకేయీ! నీ కెవ్వ రిట్టి దుర్బోధనము జేసినారు? పిశాచము పట్టినదా? నామీద నీకుండెడి ప్రేమ యేమైనది? నామాట విని నీ విక నిట్టి కోర్కులు కోరకుము. నీకు శ్రీరాము డేమి యపచారము గావించినాడు? అతనిని వనమునకు బంపు మని చెప్పుటకు నీకు నో రెట్లు వచ్చినది? అతని యౌవరాజ్యాభిషేకమునకు వలయు పరికరము లను సిద్ధపఱచియున్నాడను. నా ప్రయత్నము లన్నియు నిష్ఫలములు గావింతువా! ఆ మహోత్సవమునకు ననేక రాజులను రావించితినే. వా రందఱును శ్రీరాముడే యువరా జగు నని యనుకొనుచున్నారు గదా; ఇప్పుడు భరతుడే యువరాజు గాని, శ్రీరాముడు గాడు అని చెప్పినచో నాచపలచిత్తమునకు నలుగురును నవ్వరా? కైకేయి నన్ను బాధించుటచే నే నిట్లు చేసితి నని చెప్పినచో విన్నవా రంద ఱేమందురు? కౌసల్య నన్ను నిందింపకుండునా? కైకేయీ! నీవు చెప్పినట్లు చేసితినేని. నే నెంతో కాలము జీవించియుండను. సత్పురుషు లందఱు న న్నెడబెట్టుదురు, 'కన్న కుమారుని కాఱడవుల కంపిన కఠినాత్ము' డని న న్నందఱు దూషింతురు. అయ్యో! నా కెంత దుర్దశ సంభవించినది! దుష్టురాలా! నీ వింత దుష్ట స్వభావము గల దాన వని నే నిదివఱ కెఱుగక నిన్ను ప్రేమించుచుంటిని; నీ ముద్దు చెల్లించుచుంటిని. ఇదిగో యిప్పుడు గదా నీవు దుష్ట సర్పమువంటి దాన వని తెలిసికొంటిని! నీ వెంత దుర్మార్గురాల వైనను ని న్నెవ్వ రేమియు ననరు. లోకు లందఱును న న్నే నిందింతురు, 'వివేకము లేక దశరథుడు ఆడుదాని మాట విని కొడుకు నడవులకు బో బంపెను. ఎంత కఠినాత్ముడు!' అని జనులంద ఱు దూఱుదురు. ఇక నీలోకములో దశరథు డెవ రనిన, భార్యను సంతోషింప జేయుటకు కన్నకుమారు నడవులకు బంపిన రాజని నల్వురును జెప్పుకొందురు.

"ఆహా! కైకేయీ! నాకు గలిగెడు అపకీర్తికి కారకురాల వైతివే! నీవు ఇక హాయిగా నుందువు గదా! మంచిది! వేయేండ్లు సుఖింపుము. శ్రీరాము డడవులకు బోయి, నేను జచ్చి, కౌసల్య కూడ మృతినొందిన పిమ్మట హాయిగా నీవును నీ కుమారుడు భరతుడును రాజ్యము జేయుడు. నీ కోర్కె

యంతట నెఱవేరునా ? ఓ దేవీ! కరుణింపుము! నీ మగని నశింపజేయకుము" అని బ్రతిమాలుకొనెను.

ఇట్లు విలపించుచు దుఃఖముచేత గుండెలు బ్రద్దలై రాజా నాటి రాత్రి యెట్లెట్లో గడపెను. అనురాగము కొంతయేని లేక కైకేయి భర్త నవమానించెను. మఱునాటి యుదయము మరల ఆమె తన కోర్కె దశరథునకు జెప్పెను.

పట్టిన పట్టు వదలని కైకేయి నిర్బంధముచేతను, ఆడిన మాట తప్పుటకు నిష్టము లేకపోవుటచేతను, దశరథుడు వలలో పడిన లేడి వలె చిక్కుబడి పరితపించుచుండెను. పూజునకును చక్రమునకును నడుమ నిలిచి బండిని లాగు ఎద్దువలె బాధ పడుచుండెను గాని, కొంత సేపటికి అతనికి కొంచెము మనోదార్ఢ్యము గలిగినది. మొగమున నెత్తురుబొట్టు లేక యుండినను ధైర్యము వహించి నిలువబడి, "కైకేయీ ! అగ్ని సాక్షిగా నాడు నిన్ను పాణిగ్రహణము చేసికొంటిని; కాని యిప్పుడు విడనాడుచున్నాను. మఱి నిన్ను జూడను." అని పలికెను.

సూర్యోదయమైనది. వసిష్ఠుడును తక్కిన పురోహితులును కాలోచిత కృత్యములు వేగముగా దీర్చుకొని, గృహములు విడిచి నగరివీథుల వెంబడి వచ్చిరి. ఆ వీథులలో ఇండ్లన్నియు ఒప్పుగా సింగారములతో నిండియుండెను. వేలకొలది జనులు శ్రీరాముని యౌవరాజ్యాభిషేకము చూచుటకై వచ్చి వీథుల మూగియుండిరి. వసిష్ఠుడు రాజమందిరము ప్రవేశించి జరగబోవు సంస్కారమున కంతయు సిద్ధముగా నున్నదని రాజునకు వార్త నంపెను. ఆ వార్త రాజసూతుడు దశరథునకు దెలియజేయుటకై అతని సముఖమునకు బోయి, యథావిధిగా చేతులు జోడించి రాజును స్తుతించుచుండెను. దుఃఖముచేత వాచి యెఱ్ఱబాఱి యున్న కన్నులు విప్పి, కందిన మోమెత్తి, దశరథుడు అతనిని జూచి, "సూతుడా! సన్నేల స్తుతింతువు ? పగిలియున్న నా హృదయమును నీమాటలు మరల పొడిచి బాధింపుచున్నవి. నీవు పోయి శ్రీరాముని నా కడ కంపుము." అని చెప్పెను.

పిమ్మట శ్రీరాముడు తండ్రి యాజ్ఞ చొప్పున తన గృహము విడిచి దశరథుని గృహమునకు వచ్చెను. అతనితో ఇందీవరాక్షి సీతయు వచ్చినది.



వారిద్దఱును ద్వారముకడ నిలిచిరి. అప్పుడు దశరథుడు శయ్యపై గూర్చుండియుండెను. అతని ప్రక్కనే కైకేయియు, సుఖాసీనయై యుండెను. లోపలికి పోయి శ్రీరాముడు మొదట తండ్రికిని, తర్వాత కైకేయికిని, నమస్కరించి తనను రావించుటకు గారణ మేమని దశరథుని వైపు చూడగా, పాపము! ఆ మహారాజు మొగము దుఃఖముచే వాడి, పిచ్చివాని మొగమువలె గనబడినది; అతని కన్నుల నీరు నిండియుండెను. అందుచేత నతడు కుమారునితో నేమియు మాటాడలేకపోయెను.

అప్పుడు చెలరేగిన యాడుపులివలె కఠిన హృదయయై ఆ కైకేయి రాజునకు బదులుగా తానే ప్రత్యుత్తర మిచ్చినది: "శ్రీరామా నీ తండ్రి నా కిదివఱకు రెండు వరముల నిచ్చెద నని వాగ్దానము చేసెను. కాని, ఇప్పుడు వాని నిచ్చుటకు వెనుక దీయుచున్నాడు. భరతుని యువరాజుగా జేయుమనియును నిన్ను దండకారణ్యమునకు నంపి, పదునాల్గు సంవత్సరములు వనవాసము చేయబనుపుమనియును కోరితిని. నీ తండ్రి ప్రతిజ్ఞ పాలింపవలెనని నీవు కోరినచో, నీవు నగరము విడిచి పదునాల్గు సంవత్సరములు వనవాసము చేయవలెను. భరతుడు యౌవరాజ్యాభిషిక్తుడగును." అని చెప్పినది.

అ మాటలువిని, శ్రీరాముడు ఆమెకు నమస్కరించి, "తల్లీ! నీ కోర్కె చొప్పున నేను తప్పక అడవుల కేగి, వనవాసము జేసెదను" అని లేశమైనను కోపము గాని, విచారము గాని, పొందక చెప్పెను. తన తండ్రి చేసిన ప్రతిజ్ఞ యెట్టిదైనను దానిని పాలించుటయే తనకు విహిత మని యతడు దలచెను.

## XIII
## శ్రీరాముడు వీడ్కొనుట

రాజ్యము విడిచి వనవాసము చేయవలసివచ్చినదని శ్రీరాముడు లేశమైనను కలత జెందలేదు; కాని, తక్కిన వారందఱును అతనిపై ననురాగముచేత గైకేయి కోర్కులకు సమ్మతింపకుండిరి. శ్రీరాముడేల వనవాసము చేయవలెను ? కైకేయి మాటలు విని దశరథుడేల శ్రీరామున కన్యాయము చేయవలెను ?" అని కౌసల్యయు లక్ష్మణుడును చెప్పుచుండిరి. సీతకూడ ఇట్లే అనుకొనుచుండెను.

అయినను, శ్రీరాముడు మాత్రము దృఢసంకల్పుడై యుండెను. చెప్పినట్లు చేయవలెను. ఆడిన మాట తప్పగూడదు. తాను తన తండ్రి మాట వినకున్న నతని ప్రతిజ్ఞకు భంగము గావించిన వాడగును; జను లందఱును, "దశరథుడు దృఢప్రతిజ్ఞ జేసి తుదకు ఆడిన మాట తప్పిన వా డయ్యెను" అని నిందింతురు. తన తండ్రి కంత యవమానము కలుగుట శ్రీరామున కెంత మాత్రము నిష్టము లేదు; కావున పట్టణము విడిచి యడవుల మునివృత్తిని నుండుటకే నిశ్చయించుకొని ప్రయాణ సన్నద్ధుడయ్యెను.

ఇందులకు లక్ష్మణుడు సమ్మతింపక శ్రీరాముని పక్షమున యుద్ధము నైనను జేయదలచెను. రాజ్యము శ్రీరామునికి జెందుట ధర్మము; అట్లు కాక శ్రీరాముని తొలగింపజేసిన భరతుడు మొదలయిన వారితో యుద్ధము చేయవలెనని లక్ష్మణుడు కృతసంకల్పుడై యుండెను, కాని భరతుని యెడల తప్పేమియు లేదని శ్రీరాముడే చెప్పెను.

కౌసల్య తన కన్నకుమారుడు వనమునందు పడనున్న పాట్లు దలచికొని గుండె బ్రద్దలగునట్లు దుఃఖించి "నాయనా! నీ వెంతమాత్రమును వెడలిపోకుము" అని బ్రతిమాలుకొనెను. కాని శ్రీరాముడు దృఢచిత్తుడై యుండెను. మంచి మాటలు చెప్పి తల్లి నోదార్చి, "అమ్మా! ధర్మమార్గ మనుసరించి నేను చేయ దలచిన దానిని నివారింపకుము" అని యతడు శాంతముగా నామెను సమాధానపఱచెను.

సీత యిది యంతయు విని, మిక్కిలి యలుక వహించినది. సహజముగా సాత్వికయే యైనను దనకు బ్రియులైన వారికి ఆపద సంభవించినప్పుడు ఆమె ధైర్యసాహసములు కలిగియుండును. "శ్రీరాముడు వనమునకు బోవుట తప్పని యెడల నేనును అతనితో బోక మానను, మగని విడిచి యొక క్షణ మైన నుండనోపను. భార్య భర్త ప్రక్కనే గదా యుండవలయును. శ్రీరామునితో నుండుదు నేని నా కేమియు గష్టముగా దోచదు. అడవుల నేను పడగల కష్టములు నన్నెంతమాత్రమును బాధింపవు. అత డనుభవింపని సౌఖ్యము లీరాజమందిరమున నెన్ని యున్నను నాకు మనశ్శాంతి కలుగదు."



అని సీత పరితపించుచుండెను. తనను గూడ వెంటగొని పోయిన గాని ఊఱట లేదని యామె చెప్పుచుండెను.

లక్ష్మణుడు శ్రీరామునితో వెడలుటకే సమకట్టియుండెను. శ్రీరాముడు



సీతారాములు అడవికి బోవుట

సీతను లక్ష్మణుని తనతో గొనిపోవక తప్పినది కాదు. బ్రాహ్మణులకు సంతర్పణము చేసి సీతాసమేతుడై శ్రీరాముడు తండ్రియొద్దకు బోయి సెలవుగైకొనగా, పాపము! దశరథుడు దుఃఖాక్రాంతుడై తనను దాను నిందించుకొని, శ్రీరా

ముని రాజ్యపరిపాలనము చేయుమని బ్రతిమాలుకొనెను; కాని, దానికి శ్రీరాముడు సమ్మతింపక, "తండ్రీ! నీ ప్రతిజ్ఞ పాలించుటకే దృఢసంకల్పము గలవాడ"నని చెప్పగా దశరథుడు సిగ్గుచేతను దుఃఖముచేతను తల వంచుకొని యూరకుండెను. అత డేమి చేయగలడు? కైకేయి పట్టిన పట్టు వదలలేదు.

ఎంత కఠినాత్మురాలో గాని కైకేయికి లేశమైనను జాలి పుట్టలేదు. మోమోటమి లేక వనవాసమునకు దగిన నారబట్టలు తెప్పించి శ్రీరాముని సీతను ధరింపుమని యామె సెలవిచ్చెను. ఆమె యాజ్ఞను శిరసావహించి, శ్రీరాముడా నారబట్టలు కట్టుకొనెను; సీతయు గట్టుకొనుటకు సిద్ధముగా నుండగా "ఒక్క శ్రీరాముడే వనవాసము చేయవలెననిగదా నీవు కోరినది? అతనిపై గల యనురాగము చేతను సీతయు, లక్ష్మణుడును, వానితో గలసి పోవుచున్నారు. వారిని నీవు పంపుమన లేదే; వారేల నారబట్టలు కట్టుకొనవలెను"? అని దశరథుడు కైకేయితో చెప్పి సీత కనేక వస్త్రాభరణముల నిచ్చెను.

సీతయు రామలక్ష్మణులును ముువ్వురును వెళ్లిన తర్వాత అయోధ్యయందలి పౌరు లందఱును "అయ్యో! దశరథమహారాజా! ఏమి నీ తెలివి? నీకు చెడుకాల మాసన్నమైనది" అని యా వృద్ధమహారాజును తిట్ట నారంభించిరి; అందఱును మిక్కిలి దుఃఖించిరి. కౌసల్యకు గుండె చెక్కలయినది. ఆమె సుమిత్రకడకు బోయి, దుఃఖించినది. లక్ష్మణుని తల్లియైన సుమిత్ర తన కుమారుని యౌదార్యమునకును ధైర్యమునకును గడు నుబ్బుచు కౌసల్యనోదార్చుచుండెను. ఆ యిరువురును కొడుకుల నెడబాసి యుండవలసివచ్చినది గదా యని కడు దుఃఖించిరి.

సీత, శ్రీరాముడు, లక్ష్మణుడు, వెడలునపుడు కౌసల్య యొద్దకును సుమిత్ర యొద్దకును బోయి, వారి సెలవు గైకొనిరి. "తల్లీ! దుఃఖింపకుము. శీఘ్రకాలములో మేము మరలి వచ్చెదను. తర్వాత మన మందఱము కలసి హాయిగా నుందుము" అని శ్రీరాముడు కౌసల్యతో జెప్పెను.

సుమిత్ర తన కుమారుని ముద్దు పెట్టుకొని "నాయనా! నీ యన్నయెడల భక్తుడవై యుండుము. సీత నీకు తల్లివంటిది. వారిరువురకును సేవ చేయుచుండుము; వారితో గూడ నీవును బొమ్ము" అని చెప్పినది.



# XIV

## శ్రీరాముడు దండకారణ్యమునకు బోవుట

సీతా సమేతులై రామలక్ష్మణులు గోమతీ నది దాటి రమ్యమైన విశాల కోసల దేశములలోనుండి, ప్రయాణముచేసి, గంగా నదీతీరము జేరిరి. అచ్చట



సీతా రాములు చిత్రకూటమును సమీపించుట

నొక చెట్టుక్రింద నొక రాత్రి విశ్రమించిరి. దానికి జేరువ నున్న నిషాదరాజైన గుహుడు శ్రీరాముని యొద్దకు బోయి, నమస్కరించి వారి ముువ్వుర

కతిథిసత్కారము గావించెను. వాని యింట మూడుదినము లుండి "ఇక సెల విండ"ని వేడగా నతడు తన సేవకులను బిలిచి గంగానది దాటుటకు నోడ సిద్ధముగా నుంచు డని సెల విచ్చెను.

అంతవఱకు నా మువ్వురు సుమంత్రుని రథ మెక్కి వచ్చిరి. సుమంత్రుడు దశరథ మహారాజు సూతుడు గనుక వానిని అయోధ్యకు మరలి పొమ్మని చెప్పిరి. తనకు ఇష్టము లేకున్నను శ్రీరాముడు చెప్పినటుల చేయకుండుట తగ దని యతడు మరలి పోవుట కొప్పుకొనెను. "సుమంత్రా! నీవు శీఘ్రముగా బోయి నా తండ్రికి మా కుశలము తెలియ జేసి మా నిమిత్తము భయపడ వలదనియు దుఃఖింప వలదనియు జెప్పుము" అని శ్రీరాముడు సెల విచ్చెను. తన యన్న కన్యాయ్యము జరగినది కదా యని, కోపముచేత లక్ష్మణుడు అవినయముగా దండ్రికి వార్త బంపవలె నని తలచెను, కాని శ్రీరాముడందులకు సమ్మతింపక లక్ష్మణుని వాక్యములు తండ్రికి దెలియజేయ వలదని సుమంత్రునితో జెప్పెను. చింతాక్రాంతుడై యున్న తండ్రికి సంతాప మెక్కువ జేయు వార్త బంపుట కెంతమాత్రము సౌజన్యశీలుడైన శ్రీరాముడంగీకరింపకుండెను.

అంత నా గుహుడును సుమంత్రుడును శ్రీరామునికి నమస్కరించి, అతని సెలవు గైకొనియు, సీతాలక్ష్మణులతో నతడు గంగానది దాటిపోవువఱకు నిలిచియుండి, వారి యాపదకు జాల దుఃఖించుచు మరలిరి.

గంగానది దాటినది మొదలు వనవాసులయిన యా మువ్వురును తాపసవేషములు ధరించి యడవుల దిరుగుచు, యమున దాటి చిత్రకూటము ప్రవేశించి యచ్చట దమ నివాస మేర్పఱచుకొనిరి.

## XV

## దశరథుని మరణము

సుమంత్రుడు దశరథుని యొద్దకు మరలివచ్చి చూడగా, అతడు కడు చింతాక్రాంతుడై యుండెను. నేల మీద పొరలుచు దుఃఖించుటచే నతని దేహము ధూళి ధూసరితమై యుండెను; నిరంతర మేడ్చుచుండుటచే గన్నులు



వాచినవి. సహచరులను విడిచి యొంటిగా జిక్కిన యేనుగు వలెనే అతడు వేడి నిట్టూర్పులు విడుచుచుండెను. అట్టిదశరథునకు సుమంత్రుడు శ్రీరాముని కుశల వార్త దెలియజేయుటచే గొంతవఱకు మహారాజునకు దుఃఖశాంతి కలిగినది.

సుమంత్రుడు కౌసల్య యొద్దకు బోయి, వనవాసమున నున్నను, శ్రీరాముడు, సీతతోను లక్ష్మణునితోను సుఖముగా నున్నా డని చెప్పగా నామెకును కొంత సంతోషము కలిగినది. భర్త చెంత నుండుటచే సీత కూడ కడు సుఖముగా నున్న దనియు, శ్రీరామునిచే నెల్ల వేళల సురక్షిత యగుటవలన నడవి మృగములకు భీతిల్లకుండె ననియును వాడు చెప్పెను.

పిమ్మట కౌసల్య మహారాజు వద్దకు బోయి యతనిని నిందింపజొచ్చెను. "అహాహా! మహారాజా! సత్యసంధుడవే కాని వాత్సల్య హీనుడవు గదా! నా యదృష్టము బాగుగానే యున్నది. నీ ప్రియభార్య శ్రీరాముని యడవులకు బంపు మనియే కోరినది కాని, చంపింపు మని కోరలేదు. అదియును మేలే. అట్లు కోరిన యెడల తప్పక నీ వామె కోర్కె నెఱవేర్తువు గదా?" అని యామె నిందించినది. ఆ మాటలకు దశరథుడు మిగుల దుఃఖించుట జూచి, ఆమె తన కఠినములగు పలుకులచే నతనికి సంతాపము గలిగించినందులకు నొచ్చుకొని తనను దాను నిందించుకొనెను.

"దేవీ! శ్రీరామునకు నేను గావించిన యపకారమునకు నా హృదయము పగిలియున్నది; ఇంకను నన్ను నిందించి నాకు సంతాపము అధికముగా జేయుదు వేల?" అని దశరథుడు కనికరము పుట్టునట్లు దీనుడై పలికెను.

అంత కౌసల్య మగని కష్టమునకు వగచి, సహజానురాగమును జూపుచు తనదుఃఖము నణచుకొని, దశరథుని ఓదార్పజొచ్చెను; అతని పాదముల బడి, తా నాడిన మాటలకు వగవక తన్ను క్షమింపుమని వేడుకొనెను.

కాలము గడచిన కొలదిని జనుల దుఃఖము తగ్గినది. విశ్వామిత్రు డిచ్చిన యస్త్రబలముచే శ్రీరాముడు సురక్షితుడై యుండును; అతని కే యాపదయు గలుగ దని సుమిత్ర చెప్పుచు కౌసల్యకు ధైర్యము కలిగించుచుండెను. సుమిత్ర పలుకు లాలించి కౌసల్య కొంతవఱకైన ధైర్యము వహించియుండెను గాని, దశరథుడు మాత్రము నానాటికి దుఃఖమెక్కువై కృశించెను.

తనకు మృత్యు వాసన్న మైన దని తోచి దశరథుడు కౌసల్యను జేర బిలిచి, తన దగ్గఱ నే యుండు మని నియోగించి "నా దృష్టి తగ్గినది. స్మృతి తప్పినది. ఆతపముచే చెఱు వెండిపోయినట్లు సంతాపముచే నా గుండె లెండి పోయినవి. నామాట జవదాటక యెల్లవేళల నా కనురక్తుడై యున్న కన్న కుమారుని ఘోరారణ్యములకు బంపితిని కదా! దేవీ! కౌసల్యా! తైలము లేక దీప మారిపోవునట్లు, సత్తువ లేక నా ప్రాణము పోవుచున్నది" అని యతి దీనముగా జెప్పెను. తనయం దత్యనురక్త యగు కౌసల్యను, మనోధైర్యము గల సుమిత్రను జూచుచు చావ సిద్ధముగా నుండుటచే హీనస్వరముతో "కఠినాత్మురాలా! కైకేయీ, యెంత పని చేసితివే!" అని యేడ్చి, మఱి కొంత సేపటికి, "అయ్యో! శ్రీరామా! అయ్యో! సీతా! అయ్యో! లక్ష్మణా! అని రాజు ప్రాణములు విడిచెను.

భరతుడు నందిగ్రామమునుండి వచ్చి యుత్తర క్రియ లారంభించు వఱకును దశరథుని దేహము క్రుళ్లకుండ తైలమున భద్రముగా నుంచిరి. రాజు భార్యలు పతివియోగముచే చంద్రుడు లేని రాత్రి వలె వన్నె వాసి యుండిరి.

# XVI

## దశరథుని యుత్తరక్రియలు

భరత శత్రుఘ్నుల నయోధ్యకు రావించుటకు వసిష్ఠుడు నందిగ్రామమునకు వార్తికులను బంపించెను. వారు దశరథుని మరణవార్త జెప్పక మఱి యేదో కారణము చెప్పి, భరత శత్రుఘ్నులను వేగముగా రమ్మనిరి. అంత నా సోదరులును రథమెక్కి యతి వేగముగా ఏడవనాటి కింటికి వచ్చిరి. భరతుడు తల్లి యొద్దకు బోయి నమస్కరింపగా, ఆమె నా తండ్రియు సోదరుడును క్షేమముగా నున్నారా?" అని యడిగినది. "తల్లీ! వారికి కుశలమే గాని, నా తండ్రి యెట్లున్నాడు" అని యడిగెను, అతడు మృతి నొందె నని కైకేయి చెప్పిన తోడనే, పితృభక్తి గల భరతుడు దుఃఖాక్రాంతుడై నేలపై బడి వెక్కి వెక్కి యేడ్వసాగెను. "అయ్యో! నేనెంత మందభాగ్యుడను! నా తండ్రిని కడసారి చూపు నయినను చూడకుంటిని!



అతని కడసారి పలుకుల నయినను వినలేను గదా! తల్లీ! నా తండ్రి నాతో నేమైన జెప్పు మని చెప్పెనా? ఆహా! శ్రీరాము డెంత యదృష్టవంతుడు! లక్ష్మణు డెంత యదృష్టవంతుడు! తండ్రి మరణ కాలమున దగ్గరనుండి యతని యుత్తరక్రియలు చేయుచున్నారు!" అని విలపించుచుండెను.

వాని నూఱడించుటకై కైకేయి, సీతతో కూడ రామలక్ష్మణులు వనవాసము చేయుటకు బోయిరనియు, భరతుడే రాజనియు సంతోషముతో జెప్పినది. ఇట్లు చేసినది తానే యనియు, భరతుడు రాజగుట కడ్డు లేకుండ జేయుటకై తా నతికౌశల్యము కనబఱచితి ననియు, తెలియజేసెను. ఆమె కప్పు డెంత సంతోషము? ఎంత ఆటోపము? రాజమాత యగుదును గదా! అని కొండంత యాశతో నుండెను. ఆమెకు లేశమైన పతిభక్తి గాని, రాజభక్తి గాని, లేదు. తన కుమారుడును తనవంటివాడే యనుకొనెను గాని, అతడు యెంత భక్త్యనురాగములు గలవాడో ఆమెకు దెలియదు. తల్లి గావించిన యపకారమును దలచి యామె యెంత పాపాత్మురాలో చూచి కోపము పట్టలేక, "చాలు, చాలు, తల్లీ భరతు డెన్నటికి సింహాసన మెక్కడని మాత్రము నమ్ముము; రాజు పెద్దకుమారుడే రాజగును. నేను బోయి మా యన్న యగు శ్రీరాముని అడవులనుండి తీసికొనివచ్చెదను. నా తండ్రిని అన్నదమ్ములను విడిచి నే నెట్లు రాజ్యము చేయగలను? నా కీ రాజ్యమును వద్దు; ఈ భాగ్యమును వద్దు. వారి నడవులకు బంపుటచే నా సంతాపమును వేమడుగు లధికము జేసితివి. గాయములు తగిలి మండుచున్న నామనస్సునకు నుప్పునగారమును వేసి మఱింత నన్ను వేధించుచున్నావుగా! అయ్యో! తల్లీ! నాపై నెంత యపనింద వైచితివి! సౌజన్యశీలుడైన శ్రీరామునికంత యపకార మెట్లు గావింపగలిగితివి? నీయెడల నత డెప్పుడు నత్యంత వాత్సల్యము జూపుచుండెనే తల్లీ! కౌసల్యయు నిన్ను సోదరివలె కడు గారాబమున జూచుచుండెనే! అయ్యో! దుష్టాత్మురాలా! అంత సౌజన్యశీల యగు కౌసల్యకుమారు నడవులకు బంపితివా? తల్లీ! సంతోషించెద వేల? దుఃఖింపుము. నలుగురిలో నీ కొడుకు నిందపాలగు నని సంతాపము జెందుము. అంతియే గాని నీ కుమారుడు సింహాసన మెక్కు నని మాత్రము దలపకుము" అని దృఢముగా జెప్పెను.

పిమ్మట భరతుడు కౌసల్య యొద్దకును సుమిత్ర యొద్దకును బోయి వారితోపాటు తానును జరిగినదానికి జింతించి, వారి నూఱడించి, "శ్రీరామునికి నే నెప్పటికి ననురక్తుడను. అతని యెడల నాకు భక్తి నిండుగాగలదు. అతనికిప్పుడు కలిగినయాపదకు నేనెంతమాత్రమును కారకుడనుగాను," అనిచెప్పెను.

అంత కౌసల్య కొంత శాంతిల్లి భరత శత్రుఘ్నులను గౌగిలించుకొని యానందబాష్పములు విడిచెను.

పిమ్మట వసిష్ఠుడు భరతుని బిలిచి, 'నాయనా! ఊఱడిల్లుము రాకొమరుడు నీవంటి ధైర్యము వహింపవలెను. నీ తండ్రిదేహమునకు దహన సంస్కారము గావింపవలయును;' అని చెప్పగా భరతుడు తండ్రి కళేబరము వద్ద నిలిచి, "అయ్యో! తండ్రీ! ఆడుదాని మాటల కేల లోబడితివి?" అని మొఱపెట్టినాడు. పిమ్మట మంత్రులు, పురోహితులు తమ తల్లులు మొదలైన వారు జూచుచుండగా జేయవలయు సంస్కారముగావించి, భరత శత్రుఘ్నులిరువురు తండ్రి శరీరమును దహనమునకై సరయూ తీరమునకు గొనిపోయిరి.

అప్పుడు వందిమాగధులు కీర్తిశేషుడైన మహారాజు గుణించి స్తుతి గీతములు పాడుచు ముందు నడిచిరి; వారి వెనుకను దశరథుని భార్యలు జుట్టు విరియబోసికొని మొఱలిడుచు కాలినడకనే బోయిరి; వారి వెనుకను సేవకులును భరతశత్రుఘ్నులును శవమునుంచిన కటమును మోసిరి; తెల్లని ఛత్రమును శవమునకు బైగా బట్టియుంచిరి; మఱికొందఱు సేవకులు చామరములు విసరుచు ఇరుప్రక్కల నుండిరి; ఆభరణములును బంగారమును బండ్లతో దహనము చేయు స్థలమునకు దీసికొనిపోయిరి; శవమునకు ముందఱ అగ్నిహోత్ర మొంకడు పట్టుకొని నడిచెను; వీరందఱి వెనుకను పౌరులనేకులు పోయిరి.

నదియొద్దున చందనపుచెక్కలు, సాంబ్రాణి మొదలయిన పరిమళద్రవ్యములతో జితిపేర్చి పట్టుబట్టలతో జుట్టియుంచిన దశరథుని దేహమును దానిపై బెట్టిరి. దాని ప్రక్కను హోమములు జేసి, జ్వాలలో బ్రాహ్మణులాజ్యమును బోసిరి; కళేబరము చుట్టును గీటు గీచి, ఒక గోవును దూడతో కూడ బలివేసి, పక్వాన్నమును నాలుగువైపుల విరజల్లిరి. పిమ్మట భరతశత్రుఘ్నులు చితి కగ్ని ముట్టింపగా దశరథుని దేహము దగ్ధమైనది.



# XVII

## శ్రీరాముని భరతుడు కలిసికొనుట

అడవులలో వెతకి, ఎట్లైనను శ్రీరాముని మరల పిలిచికొనివచ్చి సింహాసనముపై గూర్చుండబెట్ట దలచి, పరివారముతో భరతుడు బయలుదేఱెను. పోయి పోయి తుట్టతుదకు చిత్రకూటమునందు సంచరించుచుండగా కొంతదూరమున చెట్లకు పైగా పొగ కనబడినది. అచ్చటకు బోయిచూడ ఒక యుటజమున తాపసవేషముల నున్న సీతా రామలక్ష్మణు లగపడిరి.

ఇంతలో లక్ష్మణుడు భరతుని పరివారమును జూచి, "అన్నా! శ్రీరామా! భరతుడు మన కపకారము జేయదలచి మనపై దండెత్తి వచ్చుచున్నాడు కాబోలు. నీవు భరతుని సంహరింపుము, నేను కైకేయిని మంధరను సంహరింతును," అని చెప్పెను. భరతుని శీలము వానికి దెలియదు గాని శ్రీరామునకు బాగుగా దెలియును.

"భరతుడు నాయందు భక్త్యనురాగములు గలవాడు. వానిని జంపియా పాపము నొడికట్టి రాజ్యము నెట్లనుభవింపగలను. విషము గలిసిన యన్న మెవరైన భుజింతురా? ఇంతేకాక, భరతుడు మన కపకారము గావించువాడు గాడు; వాడు మిగుల మంచివాడు. తమ్ముడా! వానినిగూర్చి కఠినముగా మాట్లాడకుము," అని శ్రీరాముడు చెప్పునంత భరతుడు వారికట్టెదుట నిలువబడెను.

"అన్నా! శ్రీరామా! రా! రమ్ము! నీవు నీ రాజ్యమును దీసికొని పరిపాలింపుము." అని భరతుడు బ్రతిమాలుకొనెను. శ్రీరాముడు, తండ్రి ప్రతిజ్ఞను పాలింపుదునే కాని రాజ్యమును బరిపాలింప నని భీష్మించి, "తమ్ముడా! విధివశమున నేను వనవాసము చేయుటయు నీవు రాజ్యము చేయుటయు సంభవించినది. మన తండ్రి దశరథ మహారాజు రాజ్యము నీ కిచ్చెను. మన మతని మాట జవదాట రాదు." అని దృఢముగా జెప్పెను.

"రాఘవా! నీవే తండ్రి కనురక్తుడవు. అతడు నీకై వగచుచు దుఃఖాక్రాంతుడై మృతినొందెను. మరణకాలమున నిన్నే తలచుచుండెను."

అని భరతుడు చెప్పగా నంతవఱ కేమియు నెఱుగని వాడగుటచేత తండ్రి మరణవార్త విని, పిడుగు పడినట్లు మూర్ఛిల్లి నేల వ్రాలెను. కొంత సేపటికి దెలివి దెచ్చుకొని సీతతోను లక్ష్మణునితోను కలసి, ఏటికి బోయి, స్నానముజేసి యథావిధిగా పితృతర్పణ మొనరించెను.



భరతుడు రాముని పాదుకలు పుచ్చుకొనుట.

మఱి యొకసారి భరతుడు శ్రీరాముని రమ్మని బ్రతిమాలెను. ఎంత బ్రతిమాలినను శ్రీరాముడు దండ్రియాజ్ఞ శిరసావహించినవాడు గనుక మరలి వచ్చుట కొల్లకుండెను. భరతునితో వచ్చిన వసిష్ఠుడును శ్రీరాముని ననేక



విధముల రమ్మని చెప్పెను గాని, శ్రీరాముడు దృఢచిత్తుడై యుండెను. తుదకు భరతుడు భగ్నమనోరథుడై రెండు పాదుకలను శ్రీరామున కిచ్చి "అన్నా వీని నొక్కసారి నీపాదములకు దగిలింపుము" అని చెప్పెను, శ్రీరాముడా పాదుకలను దొడిగి వెంటనే తీసి భరతున కిచ్చెను "రఘుపుంగవా! నీవు తిరిగి వచ్చువఱకును నేను నగరము వెలుపల నుందును. నీ విప్పుడు తొడిగి విడిచిన పాదుకలు సింహాసనముపై నుంచి ఈ పదునాల్గు సంవత్సరములు నీ రాజ్యమును భద్రముగా గాపాడుచుందును. ఆ పిమ్మట నీవు నీ రాజ్యమును దీసికొని పాలింతువు గాక?" అని విన్నవించి, శ్రీరాముని సెలవుగైకొని భరతుడు తన పరివారముతో నయోధ్యకు బోయెను.

## XVIII

## శూర్పణఖ ముక్కును జెవులను లక్ష్మణుడు గోయుట

భరతుడు వెడలిపోయిన పిమ్మట సీతారామలక్ష్మణులు చిత్రకూటము విడిచి దండకారణ్యము ప్రవేశించి, గోదావరీ తీరమున సుందరమైన యొక ప్రదేశమున నివాస మేర్పఱచుకొనిరి. ఆ యరణ్యము రాక్షసులతో నిండియుండెను. వారిలో చాల మందిని శ్రీరాముడు జంపెను. ఆ చచ్చినవారిలో నిరువురు, ఖరుడు దూషణుడు అనువారు, మిక్కిలి బలవంతులు.

రావణు డను పది తలలవాడు రాక్షసులకు రాజు. అతడు లంకను బాలించుచు నందెత్తైన ప్రహారములును ప్రాసాదములును గలిగి సొగసుగా నున్న యొక నగరమున నివసించియుండెను. శ్రీరామునిచే మృతినొందిన ఖరుడు రావణునకు దమ్ముడు. ఆ ఖరునితో కవలుగా బుట్టిన రాక్షసి పేరు శూర్పణఖ. రాక్షసులు నిశాచరులు; పచ్చిమాంసము తినువారు; బహు క్రూరులు.

శూర్పణఖ శ్రీరాముని భర్తగా గోరి, సీతను విడిచి తన్ను వివాహమాడుమని యతనిని వేడినది. వికృతాంగి యైన యా శూర్పణఖను జూచి నవ్వి, "ఓసీ! నన్ను గోరెద వేల? నా వెంట నాభార్య యున్నది. లక్ష్మణు డొంటిగా నున్నాడు వానిని వేడుకొమ్ము" అని పరిహాసముగా జెప్పెను. పిమ్మట నది లక్ష్మణుని గోరగా నతడు, "ఓసీ! నన్నేల వరింతువు. శ్రీరాముడు నాకు జ్యేష్ఠుడు; రాజు; వానినే మరల వేడుము" అని చెప్పెను;

ఇట్లు ముందుకును వెనుకకును దిరుగుచు, సీత దగ్గఱ నుండుటచే శ్రీరాముడు తన్ను వరింప కున్నా డని దలచి, శూర్పణఖ యా సీతను జంపుటకై యెత్తుకొని పోజూచెను. సరసము విరసమైనది గదా యని లక్ష్మణుడు కోపముతో దానిని దండించుటకై దాని ముక్కును చెవులును తెగగోసెను.



రావణుడు మారీచుడు మాట్లాడుకొనుట.

మొగమున నెత్తురు కారుచుండ నది గబగబ పరుగెత్తి పోయి, తన యన్న యగు రావణుని పాదములపై బడెను. తన చెల్లెలి దురవస్థ జూచి



కోపముతో మండిపడి పండ్లు పటపట కొఱుకుచు, "ముద్దుచెల్లెలా ! నీ కిట్టి కష్టమును గలుగజేసినవా రెవరు ?" అని యడిగెను. "అన్నా! నా ముక్కును చెవులును గోసి నన్ను బాధపెట్టినవాడు శ్రీరాముని తమ్ముడైన లక్ష్మణుడు. వా రిరువురును గొప్ప వీరులు. ఖరుడు దూషణుడు మొదలైన రాక్షసుల ననేకులను జంపినారు," అని శూర్పణఖ చెప్పినది. ఆ మాటలకు రావణుడు మఱింత కోపము దెచ్చుకొని శ్రీరామునే జంప నిశ్చయించి, లంక విడిచి, సముద్రము దాటి, రాక్షసులలో దనకు ప్రాణమిత్రుడైన మారీచు నొద్దకు బోయెను.

## XIX

## సీతాపహరణము

మారీచుడు రాక్షసాధిపతిని సగౌరవముగా నాదరించి, అతనికి ఫలాహార మిచ్చెను. కొంతసేపు విశ్రమించి రావణుడు మార్గాయాసము తీర్చుకొన్నపిమ్మట, మారీచుడు "ఏల నీ మొగము కంది యున్నది ? కోపావేశము గలవానివలె గనబడుచున్నావు" అని యడిగెను.

రామలక్ష్మణులు చేసిన పని తెలియజెప్పి, "వారిపై బగ తీర్చుకొనవలెను. అందులకు నీ సాయము వేడ వచ్చితిని" అని రావణు డనెను.

"శ్రీరాముని బలపరాక్రమములు నీవు ఎఱుగవు కాబోలు. అతని వద్ద నున్న బాణములు అమోఘములు సుమా. అతనితో నీవు విరోధపడగూడదు. నా మాట వినుము. ఈ పనియందు నన్ను సాయము చేయు మనకుము. రామునితో విరోధించుట వలన మన మందఱమును నశింతుము" అని మారీచుడు, బోధించెను.

రావణుడు, "మారీచుడా! నా యాజ్ఞ మన్నింపక పోయితివా, నిన్ను తప్పక జంపుదును" అని కోపముతో గద్దింపగా, మారీచుడు భయపడి "ఐతే, నీవు చెప్పినట్లే చేసెదను; ఏమి చేయవలెనో చెప్పుము" అనెను.

"బంగారు కొమ్ములును బంగారు చర్మమును గల చక్కని లేడిలాగున నీ రూపము మార్చుకొని, సీతకు కనబడునట్లు పర్ణశాల యెదుట గడ్డి మేయుచు నాడుచుండుము. సీత నిన్ను జూచి లేడియే యని భ్రమ పడి

నీతో ఆడుకొనుటకై, దన కొఱకు నిన్ను దెచ్చిపెట్టుమని రాముని వేడును. అతడు నిన్ను పట్టుకొనుటకు వచ్చినప్పుడు, కొంచెము కొంచెము ఎడముగా బాతిపోవుచు, మధ్యేమధ్యే నిలుచుచు, నీవెంటను అతనిని దూరముగా గొనిపొమ్ము. అంతట సీత ఒంటిగా నుండ జూచి, ఆమెను అపహరించి నేను లంకకు గొనిపోయెదను. అతడు మరల పర్ణశాలకు వచ్చి సీతనుగానక దుఃఖముచే ప్రాణములు విడుచును. అదియే వానికి దగిన శాస్తి. ఇట్లు నా పగ తీర్చుకొనగలను" అని రావణుడు, చెప్పెను.

తర్వాత ఈ యిద్దరు రాక్షసులును శ్రీరాముని పర్ణశాలకు బోయిరి. మారీచుడు మృగరూపము ధరించి, చంగుచంగున గంతులు వేయుచుండెను. రావణుడు సన్యాసివేషము వేసికొని చేతిలో త్రిదండము పట్టుకొని తగిన సమయమునకై వేచియుండెను.

రావణుడు చెప్పినట్లే అంతయు జరిగినది. లేడి కనబడగానే, సీతదానిని పట్టుకొని దెచ్చిపెట్టుమని రామునిగోరెను. రాముడు విల్లును అమ్ములును పట్టుకొని లేడివెంట బోయెను. లక్ష్మణుడు సీతకు గాపుగా పర్ణశాలయందుండెను.

మారీచుడు రామునికి దొరకకుండ అంతకంతకు కడు దూరముగా నతనిని దన వెంట గొనిపోయెను. అప్పుడప్పుడు మాయమగుచు, మరల మరల నగపడుచు, లేడి మోసపుచ్చుట జూచి, అది రాక్షస కృత్యముగా దెలిసికొని, అమోఘమైన ఒక బాణము పొదినుండి తీసి లేడి నేసెను. అది గుండెలో గ్రుచ్చుకొని, రాక్షసుడు తన నిజరూపముతో నేల గూలెను. అప్పుడు వాడు శ్రీరాముని కంఠధ్వని వలె వినబడునట్లు "హా! లక్ష్మణా రక్షింపుము!" అని యఱచుచు ప్రాణములు విడిచెను.

ఆ యార్పు పర్ణశాలలో నున్న సీతకు వినబడి "లక్ష్మణుడా! తన్ను రక్షింపుమని రాముడే అఱచుచున్నాడు! వేగము పొమ్ము" అని త్వరపెట్టెను.

లక్ష్మణుడు "అమ్మా! రామునికి ఏమియు భయములేదు. అతనికి హాని చేయగలవారెవరున్నారు? నిన్ను విడిచి నేను వెళ్లినయెడల, నీవు ఒంటిగా నుందువే; నిన్ను కాపాడువారెవరు?" అని చెప్పెను.

సీత వెక్కి వెక్కి యేడ్చుచు లక్ష్మణుని నిందింపజొచ్చెను. ఆమె దుఃఖ



ము చూచి సహింపలేక, రామునికి అపాయము లేదని నిండు నమ్మక మున్నను, లక్ష్మణుడు రామునివద్దకు వెళ్లెను.

అంతట రావణుడు సన్యాసి వేషముతో పర్ణశాలద్వారము కడకు వచ్చి భిక్షము పెట్టుమని యడిగెను. జానకి వానిని ఆదరించి ఆతిథ్య మిచ్చినది. వాని ముందఱ ఫలాహార ముంచి కూర్చుండుటకు ఆసనము వేసినది.

అప్పుడు రావణుడు నిజరూపమును ధరించి, తన్ను చూచి మూర్ఛపోయిన సీతతో "సుందరీ! నేను రావణుడను; రాక్షసులకు జక్రవర్తిని; నా రాజధాని లంకాపట్టణము; సువర్ణమయమైనది; అది చాల దూరమున సముద్రము నడుమను ఉన్నది. మనోహరీ! రాముని విడిచి, నాకు భార్యవై నా వైభవము గైకొమ్ము" అని చెప్పెను.

జానకికి ఈ మాటలు వినబడి, శూలములు గ్రుచ్చుకొన్నట్లులై, చెవులు మూసికొని, "పాపీ! ఇట్టి మాట లాడుటకు నీకు నోరెట్లు వచ్చినదిరా? నోరు మూసికో! ఆహా! దౌర్భాగ్యుడా! నీ దుష్కృత్యమును చూడలేక ఆకాశమునుండి చుక్కలు జలజల రాలును గాబోలురా!" అని రాక్షసుని తృణీకరించి ఆమె లోనికి బోయి కోపముతో వణకుచు నిలబడెను.

రావణుడు తన వికృతాకారముతో లోనికి బోయెను. వానిని చూచుచునే సీత మైమఱచి నేల బడెను. తోడనే వాడు సీతను ఎత్తుకొని, విమానముపై నెక్కించి, ఆకాశమార్గమున లంకకు బోవుచుండెను.

## XX

## జటాయువుతోడి యుద్ధము

గృధ్రరాజైన జటాయువునకును దశరథునకును చిరకాలస్నేహము కలదు. జటాయు డిప్పుడు ముసలివాడై, ఒక పర్వత శిఖరమునందు నెమ్మదిగా నుండెను. రావణుడు సీతను అపహరించుకొని పోవుట చూచి, అతడు ఆ రాక్షసుని ఎదిరించి "జానకిని విడిచిపెట్టు, దుర్మార్గుడా! విడిచిపెట్టు క్షణమే! విడువకున్న, చూడు నిన్ను చంపెదను!" అని తన వాడి గోళ్లతో ఆ పక్షిరాజు రావణుని చీర మొదలుపెట్టెను. రాక్షసుని దేహము

నుండి రక్తము కారి ప్రవహించినది ; మాంసము కండలు కండలుగా తెగి పడినవి. ఐతే రావణుడు తన ఖడ్గముతో జటాయువు ఱెక్కలు విఱుగ గొట్టినందున, పాపము! ఆ వీరుడు నేల గూలెను.

అటుపిమ్మట రావణుడు మరల విమానమును పోనిచ్చెను. సీత క్రిందికి చూచుచుండ త్రోవలో అనేక ఋష్యాశ్రమములు ఆమెకు కనబడెను. తన నగలు మూటకట్టి క్రింద పడవైచిన యెడల, ఎవరైనను వానిని తీసి రామునికి ఇయ్యగలరని తోచి, చీరకొంగు చింపి, దానిలో తన యాభరణములు మూటకట్టి ఒక కొండపైని ఐదుగురు వానరులు కూర్చున్న చోట పడవేసెను.

అటుపిమ్మట రావణుడు సీతతో లంక ప్రవేశించి, అశోకవనమందు ఒక మేడలో ఆమెను ఉంచి, భయంకరాకారులైన రాక్షసులను పెక్కుమందిని కావలిపెట్టెను.

## XXI

## రామలక్ష్మణులకు జటాయువు కనబడుట

సీతను పర్ణశాలలో ఒంటిగా విడిచి, లక్ష్మణుడు రామునివద్దకు పోవుచుండగా త్రోవలో రాముడు ఎగురుపడి, "సీతను ఎక్కడ నుంచి వచ్చినావు? అది సురక్షితగా నున్నదా?" అని అడిగెను. ఒంటిగానున్న సీతకు ఉపద్రవము కలుగునేమో యని రాముడు మిగుల దిగులుపడెను.

అన్నదమ్ములిద్దరును వడివడిగా నడచుచు పర్ణశాలకు పోయి చూడగా, అందు సీత లేదు. చుట్టుపట్టుల నంతట వెతకినను ఆమె కానరానందున, వారు దూరమున ఉన్న అడవిలో చూడ బోయిరి. త్రోవలో ఱెక్కలు విఱిగి, కదలమెదల లేక, కొట్టూపిరితో జటాయువు కనబడెను.

రామలక్ష్మణులు "నీవు ఎవడవు? సీతసమాచారము నీకు దెలియునా?" అని యడిగిరి. అతడు "నేను గృధ్రరాజను, నా పేరు జటాయుడు. రాక్షసరాజైన రావణుడు సీతను ఎత్తుకొని ఆకాశమార్గమున బోవుచుండగా చూచి, వానితో యుద్ధముచేసి, నా గోళ్లతో వానిని చీల్చితిని. వాడు కత్తితో నన్ను కొట్టి, నా ఱెక్కలు రెండును నఱికెను." అని చెప్పి ఊరకుండెను.

తాను అనుకొన్నంత పని జరగినదని రాముడు విచారించి, రావణు



డే దిక్కునకు బోయె నని జటాయువును అడిగెను; కాని అతడు మాటలాడ లేక, దక్షిణ దిక్కుగా తలమాత్రము త్రిప్పి, ప్రాణములు విడిచెను.

రామలక్ష్మణులు జటాయువునకు అగ్నిసంస్కారమును ఉత్తరక్రియలును చేసి, దక్షిణాభిముఖులై దండకారణ్యములో సంచరించుచు బోయిరి. వారిదుఃఖము ఎవరు వర్ణించి చెప్పగలరు?

## XXII

## కబంధుని శాపవిమోచనము

ఒకనాడు రామలక్ష్మణులు అడవిలో దిరుగుచుండగా, లేళ్లు బెదరి, నలుదిక్కుల బఱుగులెత్తసాగెను. ఆ క్షణమందే ఉఱుమువంటి ధ్వని యొకటి వినబడినది; పెద్ద మంటకూడ ఒకటి కనబడినది. తోడనే లావుగా వికృతాకారుడైన ఒక రాక్షసుడు వారికి నెదురుపడెను. వానికి శిరస్సు లేదు; కాఱుమబ్బు వంటి నల్లని దేహమును, మఱ్ఱికొమ్మల వంటి లావైన భుజములును, మ్రాకుల వంటి పొడుగాటి చేతులును కలిగి, వాడు బహు భీకరముగా నుండెను; వానికి బొరమీదనే ఉన్నవి రెండు పెద్దకన్నులు; వెలగకాయ లంతలేసి గ్రుడ్లు చింతనిప్పులవలె ఎఱ్ఱగా నున్నవి. కడుపుమీదనే గుహలాగున వెడల్పయిన నోరు తెఱచియున్నది.

ఈ రాక్షసుడు చేతులు చాచుకొని భీకరముగా వచ్చుచుండగా లక్ష్మణుడు వానిచేత జిక్కి తప్పించుకొన జాలడయ్యెను. ఆ రాకాసి లక్ష్మణుని గట్టిగా ఒక చేతితో పట్టుకొని, రామునివైపు చూచి కన్నుగీటుచు మెల్లగా నోట బెట్టుకొని పోవుచుండగా, "అన్నా! రక్షింపుము! రక్షింపుము" అని లక్ష్మణుడు అఱచెను. "కుడిచెయ్యి నీవు నఱకి వేయుము; ఎడమచేయి నేను నఱకెదను" అని రాముడు ఉపాయము చెప్పెను.

ఇట్లు అన్నదమ్ములిద్దఱును తమ ఖడ్గములతో ఆరకసి రెండుచేతులు నఱికివేసిరి. తర్వాత లక్ష్మణుడు వానిని కత్తితో బొడిచి నేలను కూలవైచెను.

ఆ రాక్షసుడు ప్రాణములు విడువగానే, వాని శరీరమునుండి దివ్యరూపుడైన పురుషుడొకడు వెడలివచ్చి, రామునకు నమస్కారము చేసి చేతులు జోడించుకొని, నిలువబడెను.

“ఎవడవు నీవు, దివ్యపురుషుడా?” అని రాము డడిగెను.

“నేను గంధర్వుడను; నా పేరు కబంధుడు. ఒకానొక బ్రాహ్మణుని శాపముచే నే నిట్లు వికృత రూపముతో రాక్షసుడనై జన్మించితిని, మహాత్మా! నీవు శ్రీరాముడవని నేను ఎఱుగుదును. నీ భార్య సీతను రావణుడు అపహరించినాడు. నీవు సుగ్రీవుని వద్దకు బోయి, అతనితో స్నేహము చేసికొనుము. అతడు తన నలుగురు మంత్రులతో పంపాతీరమం దున్నాడు.

నీవలెనే వాడును భార్యను కోలుపోయి దుఃఖించుచున్నాడు, కనుక, నీవు వానికి సాయము చేయుము; నీకు అతడును సాయముచేయును. నీకు శీఘ్రములోనే సీత దొరకగలదు” అనిచెప్పి, గంధర్వుడు అదృశ్యుడయ్యెను.

## XXIII

## రాముడు సుగ్రీవునితో జెలిమిచేసికొనుట

అంతట రామలక్ష్మణులు కబంధుడు చెప్పిన మార్గమున ప్రయాణము చేసి, శీఘ్రకాలములోనే పంపాతీరము జేరిరి. వికసితపద్మములతోను జలవిహంగములతోను చెన్నుమీరిన యా సరోవరమునందు స్నానము చేసి, రాజకుమారు లిద్దఱును సుగ్రీవుని వాసస్థానము నరయుచు బోవుచుండగా, వాలి తమ్ముడైన సుగ్రీవుడును, వాని నలుగురు మంత్రులును కొండ మీదనుండి వారిని జూచి, శత్రువు లనుకొని దిగులొందిరి.

సుగ్రీవుని మంత్రులలో నొకడు హనుమంతుడు; అతడు మిగుల బుద్ధిమంతుడు. ఆ క్రొత్తమనుష్యు లెవరో కనుగొనుటకై అతడు వారి కెదురుగా బోయి పలుకరించెను. రామలక్ష్మణులు వానిని చూచుచునే వాని యోగ్యతను కనిపెట్టి, వాడు విశ్వాసార్హు డని తెలిసికొనిరి. హనుమంతుడును వారి సమాచారము నెఱిగికొని, తన రాజైన సుగ్రీవుని వృత్తాంతము వారికి తెలియజేసెను. అటుపిమ్మట సుగ్రీవునితో జెలిమిచేసికొనగోరి, వారు హనుమంతునితో ఋష్యమూక పర్వతమునకు బోయిరి.

సుగ్రీవునితో రాముడు సఖ్యము చేసికొన్న పిమ్మట తన దుర్దశను గుఱించి రాముడు సుగ్రీవునితో జెప్పి విలపించెను. అప్పుడు సుగ్రీవుడు వస్త్రఖండము ఒకటి పైకితీసి, “కొన్నాళ్లక్రిందట రాక్షసు డొకడు ఒక





స్త్రీని చెఱబట్టి విమాన మెక్కించుకొని ఆకాశమార్గమున బోవుచుండగా ఆ స్త్రీ విలపించుచు దన యాభరణములు చీరకొంగున గట్టి, ఆ గుడ్డమూట మా కొండమీద జారవిడచినది. ఇదిగో ఆ గుడ్డమూట!” అని చూపించెను. అది చూచి, రాముడు సీతను చూచినట్టుగా సంతోషించెను.

తర్వాత సుగ్రీవుని కిష్కింధకు రాజుగా నభిషిక్తుని జేసి, అప్పుడు రాజ్యమేలుచున్న వాని యన్నయగు వాలిని వధింతు నని రాముడు ప్రతిజ్ఞ చేసెను. సుగ్రీవుడును సీతను వెతకింతునని ప్రమాణపూర్వకముగా జెప్పెను.

రామలక్ష్మణులును సుగ్రీవుడును రాజధానికి బోయిరి. సుగ్రీవుడు అట్టహాసము చేసి వాలిని యుద్ధమునకు బిలిచెను. వాలి కోపోద్రేకముచే యుద్ధసన్నద్ధుడు కాగా, వాని భార్య తార వారించి, “సుగ్రీవునకు సాహాయ్యము దొరకినది కాబోలును. అందుచేతనే నేడు కయ్యమునకు గాలు ద్రవ్వుచున్నాడు. నీవు ఇప్పుడు వానితో యుద్ధము చేయవద్దు. రాము డనెడు ఒక గొప్ప రాజకుమారునితో సుగ్రీవుడు చెలిమి చేసికొనెనట. రాముని తమ్ముడు లక్ష్మణుడు అనువాడును మిగుల బలశాలియట! భల్లూకరాజు జాంబవంతుడు కూడ వారితో గలిసియున్నాడు. వారందఱును నిన్ను నాశముచేయ సమకట్టియున్నవారు. కనుక నీ విప్పుడు పోవుట తగదు” అని చెప్పినది.

“సుగ్రీవుడు నాకన్న జిన్నవాడు; వాడు యుద్ధమునకు రమ్మనినప్పుడు నేను పోకుంటినా, నన్ను పిరికి పంద యని చెప్పడా? భయపడకుము; వాని పొగరు అణగగొట్టి, వానికి దగిన శాస్తి చేసి, ఇప్పుడే మరలివచ్చెదను”

అని భార్యను ఊరడించి, వాలి పైకివచ్చి, సుగ్రీవునితో “ఓరీ ఎన్నియోమార్లు నీతో యుద్ధము చేసి నిన్ను ఓడించియు జాలిచే నీ ప్రాణములు మాత్రము తీయనైతిని. నేడు నీవు నాచే జచ్చుటకై వచ్చినట్టున్నది” అనెను.

“రాజవై యుండియు నీవు నా భార్యను హరించినావు. భార్యను కోలుపోయినవానికి ప్రాణములపై లక్ష్యముండదే” అని సుగ్రీవుడు చెప్పెను.

అంతట వాలిసుగ్రీవులు చెట్లు ఊడబెఱికి ఒకరినొకరు కొట్టుకొనుచు, ఒకరిపై నొకరు రాళ్లు రువ్వుకొనుచు, పిడికిళ్ల పొడుచుకొనుచు, యుద్ధము చేసిరి. తుదకు వాలిదెబ్బలకు తాళలేక సుగ్రీవుడు పాఱిపోయి, రామునితో

"నీవు సాయము చేసెద నని చెప్పియు నిట్లు ఉపేక్షించుట నీకు ధర్మమా?" అని మొఱపెట్టెను. "మీరిద్దఱును ఒక్కపోలిక నుండుటచేత, మిమ్ములను ఏర్పరింపలేక, ఊరకుంటిని, 'కాని, ఉపేక్షచేత గాదు. నీవు మరల నొకసారి పోయి, నీయన్నను డీకొట్టి పిలువుము యుద్ధమప్పుడు నీ మెడలో పూలదండ యొకటి గుర్తుగా వైచికొనుము'' అని రాముడు చెప్పెను.

మరునాడు సుగ్రీవుడు మిగుల సంరంభముతో వాలిని ధిక్కరించి యుద్ధమునకు రమ్మనెను. తార యెంత నివారించినను వినక, వాలి కోపాటోపముతో వెడలివచ్చి తమ్మునితో యుద్ధము చేయదొడగెను. అప్పుడు చెట్లచాటున దాగియున్న రాముడు ధనుస్సునెత్తి బాణము సంధించి, చక్కగా గుఱిచూచి, వాలిని కొట్టెను ; ఆబాణము వాలి గుండెలో నుండి దూసికొనిపోయెను. తోడనే వాడు నేలమీద పడిచచ్చెను. శవముచుట్టును వాని బంధువులు కూర్చుండి విలపించిరి ; తార క్రిందపడి పొరలియేడ్చినది.

తదనంతరము రాముడు సుగ్రీవుని సింహాసనము మీద నెక్కించి, పట్టాభిషిక్తుని జేసెను. తన భార్య రుమను అన్నభార్య యగు తారను కూడ సుగ్రీవుడు స్వీకరించెను. తన కుమారుడైన అంగదుని యువరాజుగా జేయుట చేత తార యూరడిల్లెను.

ఇంతలో వర్షాకాలము వచ్చెను ; కనుక రామలక్ష్మణులు మాల్యవత్ పర్వతమందు చాతుర్మాస్యము జరప నుద్దేశించి, అచ్చటకు బోయిరి.

## XXIV

## అశోకవనములో సీతదుఃఖము

సీత అశోకవనమందుండి రాత్రింబగళ్లు భర్తృ వియోగమునకై వగచుచుండెను. దీక్షగా బ్రహ్మచర్య వ్రతముచే తన శరీరమును క్లేశపెట్టుకొనుచు, సుఖ మన్న మాటయే ఆమె మఱచియుండెను.

అతిభీకరాకారలైన రాక్షసస్త్రీలు ఆమకు గావలిగా నుండిరి. వారిలో గొందఱికి మూడుకన్నులుండెనట! కొందఱి నుదుటిపై నొక్కటేకన్నట! కొందఱి నాలుకలు నోటిలోనుండి పైకి పొడవుగా వ్రేలాడుచుండెనట! కొం



దఱి శరీరములు సన్ననివట! మఱికొందఱివి ఎలుగుబంటి దేహమువంటివట! అందఱికిని కత్తులవంటి వాడి గోళ్లును, పొడుగాటి పండ్లును ఉండెనట!

ఇట్టి స్త్రీలు సీత వద్దనెల్లప్పుడును కూర్చుండి రావణుని పెండ్లాడుమని బోధించుచుండిరి. తాము చెప్పినట్టు వినకున్న, ఆమెను చీరుదు మనియు నమలి మ్రింగుదు మనియు బెదరించుచుండిరి. సీత వారిమాటలు పెడచెవిని పెట్టినది. వియోగదుఃఖములో మునిగియున్న యామెకు ఇతర విషయములందు లక్ష్యము ఏమియును లేదు.

రావణుడును సీతకు ఏమియు హానిచేయలేదు. ఆమెపై వానికెంత మోహమున్నను, బలాత్కారమున ఆమెను చెఱబట్టలేదు. ఏలయన, తత్పూర్వము ఎవరో వానిని శపించియున్నారు. తనను పెండ్లాడ నిష్టములేని స్త్రీని తాను బలిమిని పట్టుకొనిన యెడల వెంటనే మృతిబొందును అనిశాపమున్నది.

సీతకు గావలిగా నున్న రాక్షసస్త్రీలలో ఒక్కర్తెమాత్రము మిక్కిలి మంచిది. దానిపేరు త్రిజట. సీత దురవస్థకు జాలి పొంది, త్రిజట యామెను తఱచుగా ఓదార్చుచుండెను. "దేవీ భయపడకుము. నీభర్త క్షేమముగానున్నాడు. అతడు వానరరాజైన సుగ్రీవునితో జెలిమి చేసికొనెను. నీ మఱిది లక్ష్మణుడును అన్నవద్దనే నెమ్మదిగా నున్నాడు. రావణుడెంత క్రూరుడైనను నీకు హాని చేయజాలడు. వానరబలముతో శ్రీరాముడు శీఘ్రముగానే వచ్చి, నిన్ను చెఱవిడిపించి, తోడ్కొనిపోవును" అని ఆ దయావంతురాలైన రాక్షసి సీతతో జెప్పుచుండెడిది. త్రిజట మాటలచే సీత దుఃఖము కొంత తగ్గుచుండెను ; కాని రావణుడు అప్పుడప్పుడు తన మాయలు ప్రయోగించి ఆమె దుఃఖమును ప్రజ్వలింపజేయును. ఒకనాటి రాత్రి చక్కని పడుచువాని వలె వేషము వేసికొని వచ్చి, తన వలపునంతయు సీత యెదుట వెడలగ్రక్కగా, సీత పెడమొగము పెట్టి, "ఛీ! దుర్మార్గుడా! నా యెదుట నుండకపొమ్ము"ని నిరాకరించి మొగముమీద చీరకొంగు కప్పుకొని, కన్నీళ్లు వరదలై కారవెక్కి వెక్కి యేడ్చెను. హతాశుడై, రావణుడు, వలపును కోపమును మ్రింగుచు, "ఈసారి క్షమించితిని ; ఇంకొకపరి నేను వచ్చినప్పుడు నన్ను పెండ్లాడ నంగీకరింపవేని, నిన్ను చంపించి నీ మాంసము వండించి తిందును" అని చెప్పిపోయెను.

# XXV

## హనుమంతుడు లంకకు బోయి సీతను గాంచుట

వర్షాకాలమంతయు రామలక్ష్మణులు మాల్యవత్పర్వతమం దుండిరి. తర్వాత శరదృతువు రాగానే, ఆకాశము మేఘములులేక నిర్మలముగా నుండెను; సీతను వెతకుటకై భటులు ప్రయాణమై పోవుటకు ఇది తగినకాలమని యాలోచించి రాముడు లక్ష్మణుని బిలిచి, "నీవు సుగ్రీవుని కడకు బోయి, ఇంకను సీతను వెదకుటకై వానరులను పంపకుండుటకు గారణమేమో అడిగిరమ్ము" అని, పంపెను.

లక్ష్మణుడు పోయి సుగ్రీవునికి రాముని యాజ్ఞ నివేదింపగా, అదివఱకే కొండఱుభటులు సీతాన్వేషణార్థము వెళ్లియున్నారని చెప్పి, అతడును లక్ష్మణునితోకూడి రాముని దర్శనమునకు బోయెను.

ఆసమయమందే సీతను వెదకుటకు బోయిన వానరులు వేనవేలుగా మరలివచ్చిరి. వీరు తూర్పు, పడమర, ఉత్తరము, ఈ మూడు దిక్కులకు బోయినవారు; దక్షిణమునకు బోయినవారు ఇంకను తిరిగిరాలేదు. ఇప్పుడు వచ్చినవారెవరును సీత సమాచారము తెలిసినవారు కారు. రావణుని దేశ మేదిక్కున నున్నదో, ఎక్కడనున్నదో, వారికి దెలియలేదు.

హనుమంతుడును వాని వెంట వెళ్లిన వానరులును బహుదినములు ప్రయాణముచేసి దక్షిణసముద్ర తీరమును చేరిరి. తిమి తిమింగలములు మొదలైన జలజంతువులతోనిండిన సముద్రము దాటుటకు ఉపాయ మేమని వారు ఆలోచించుచుండగా జటాయువు అన్నయగు సంపాతి వారికి కనబడెను. వారు వానికి జటాయువు మరణవార్తయును, రావణుడు సీతను అపహరించిన వృత్తాంతమును తెలియజేసిరి. అప్పుడు సంపాతి, "నేను రావణుని ఎఱుగుదును; అతడు లంకలో నున్నాడు; సముద్రమునకు ఆవల చాలదూరమున లంక ఉన్నది. సీత అక్కడనే ఉండవలెను" అని అన్నాడు.

అప్పుడు హనుమంతుడు కుప్పించి సముద్రము మీదనుండి ఒక్క గంతుగంతి, లంకలో ప్రవేశించినాడు. అతడు కామరూపుడు; అనగా ఇష్టము



వచ్చిన రూపము తెచ్చిపెట్టుకో గలవాడు; కావలసిన యెడల కొండంత పొడవుగా ఎదుగను గలడు, కందిగింజంత కొద్దిగా క్రుంగను గలడు. అతడు సముద్రముమీద నెగుఱుచున్నప్పుడు అతని శరీరకాంతి కఱగినబంగారువలె పచ్చగా మెఱయుచుండెను. అతని తోక ఎంతోదూరము వ్రేలాడుచుండెను. అతడు లంకలో సీతను చూచినపుడు, రాముడు ఎన్నడు వచ్చి తన్ను విడిపించునోయని యెడతెగని విచారముతో విలపించుచు, ఆమె నిద్రాహారములేక కృశించి, పాలిపోయి, మలినగాత్రయు, ఏకవేణియునై కనబడినది.

హనుమంతుడు సీతవద్దకు బోయి, "అమ్మా! నేను శ్రీరాముని దూతను; నా పేరు హనుమంతుడు. నీ భర్తయును మఱదియును వానరాధీశుడగు సుగ్రీవుని రాజధానియందు సుఖులైయున్నారు. శీఘ్రముగానే వారు వానరసైన్యముతో ఇచ్చటకు రాగలరు. నామాట నమ్ముము. నేను రాక్షసుడను గాను, వానరుడను" అని విన్నవించెను.

అప్పుడు సీత, "నీవు హనుమంతుడవని నే నెఱుగుదును. నాభర్త సుగ్రీవునికి మిత్రుడై వానివద్ద నున్నాడని యొక రాక్షసస్త్రీవలన వినియున్నాను; నీ భక్తికి మిగుల సంతసించితిని. నీవు నన్ను చూచినట్టు నిదర్శనముగా ఈ ఉంగరమును పట్టుకొనిపోయి, రామున కిమ్ము" అని, తనవ్రేలి యుంగరము తీసి, వాని చేతి కిచ్చెను.

లంకనుండి వెడలిపోక మునుపే, ఎద్దియేని యొక దుండగము చేసి రావణుని మనస్సు నొప్పింప దలచి, హనుమానుడు ఉద్యానపాలకుల సంహరించి, తోటలు పాడుచేసెను. రాక్షసభటులు తన్ను పట్టుకో రాగా, కావలెననియే, ఉద్దేశ్యపూర్వకముగా వాండ్రచే పట్టుపడెను. వాండ్రు వానిని భుజములపై నెక్కించుకొని రావణుని వద్దకు మోచికొనిపోవుచుండ, వాడు కొండంత పొడవుగా పెఱిగి వాండ్రను అణచిచంపెను.

తుదకు రావణుని సభకు హనుమంతుని గొనిపోయినప్పుడు, అతి దర్పముతో నాటోపముగా రాక్షసాధీశ్వరుని, సీతాపహరణమునకై నిందించి, సీతను రామునికి అప్పగించి వానిని శరణువేడు మని మందలించెను.

ఆమాటలకు రావణునికి హనుమంతునిపై గోపమువచ్చి, వానిని

చంపుమనెను; కాని అతనితమ్ముడు విభీషణుడు "దూతను చంపరా" దని వారించెను.

"అట్లయితే, ఈ కోతి తోకకు గుడ్డలు చుట్టి, చమురుతో తడిపి, వెలిగింపుడు. ఆ పరాభవము చాలును; చంప నక్కఱలేదు," అని రావణు డనెను.

హనుమంతుడు అంతకంతకు అనేకక్రోసులు పొడవుగా తన తోకను పెంచుచువచ్చినందున రాక్షసులు గుడ్డలు చుట్టలేక పోయిరట. వేలకొలది దివిటీలు వెలిగించినట్లు తోక మండుచుండగా, హనుమంతునకు నేమియు బాధలేదు, సరేగదా, అతడు నవ్వుచు బట్టణము నలుదిక్కులను కుప్పిగంతులు వేయుచు, తిరిగెను. అందుచే లంకలోని మేడ లన్నియును కాలిపోయినవి.

అటుపిమ్మట సముద్రము మరల దాటి ఈవలియొడ్డున దిగి, తన పరివారముతో హనుమంతుడు రాముని వద్దకు మరలెను.

సీత వృత్తాంతము తెలియక రామలక్ష్మణులును సుగ్రీవుడును చింతింపుచుండగా, రాజు తోటకావలివాండ్రు వచ్చి, "మహాప్రభూ! హనుమంతుడును అతనిపరివారమును మధువనములో చొరబడి,విచ్చలవిడిగా చెట్లెక్కి పండ్లు తెంపి,తిని వేయుచున్నారు. మేము వలదన్న, వినక, మీదు మిక్కిలి మమ్ములను కొట్టిరి" అని చెప్పిరి. ఆమాటలకు సుగ్రీవుడు అపరిమితానంద మొంది, "సీత వృత్తాంతము తెలిసికొనియే హనుమంతుడు వచ్చియుండును; అట్లుగాకున్న, ఇంతకు తెగింపడు" అని హనుమంతుని పిలుచుటకై భటులను బంపెను.

ఇంతలోనే హనుమంతుడును వానివెంట వెళ్లిన వానరవీరులును అచ్చటికి వచ్చిరి. హనుమంతుని రమ్యాకృతియు, ముఖ వైఖరియును, అతనిధీరగతియును చూచి సీతదర్శనము చేసివచ్చినాడనియే రాముడు ఊహించెను.

హనుమంతుడును తక్కిన వానరులును రామలక్ష్మణులకును సుగ్రీవునకును నమస్కరించిరి. హనుమంతుడు జరిగిన సమాచార మంతయును వారికి సవినయముగా నివేదించెను.

---



# XXVI

## వానరసైన్యము లంకపై దండెత్తుట

సీత యెక్కడ నున్నదో ఇప్పుడు తెలిసినది గనుక, సుగ్రీవుడు త్వరపడి వానరసైన్యమును సమకూర్చెను. వానరవీరులు తమ రాజునాజ్ఞ ప్రకారము నానాదిక్కులనుండి వచ్చి మూగుచుండగా, పర్వతశిఖరమున కూర్చుండి రాముడు సంతోషముతో జూచుచుండెను. కొందఱు గంతుచు, కొందఱు ఎగురుచు, కొందఱు మొగ్గలు వేయుచు, లక్షలు లక్షలు వానరులు కిచకిచలాడుచు వచ్చిరి. వారిలో కొందఱు పొడవైనవారు; కొందఱు పొట్టివారు, కొందఱు లావైనవారు; కొందఱు సన్ననివారు; కొందఱు ఎఱ్ఱనివారు; కొందఱు నల్లనివారు, ఇట్లు పలువిధములైన వర్ణములు, రూపములు, చేష్టలు గల వానరుల మూకలు చిత్రచిత్రముగా కనబడినవి.

భల్లూకరాజైన జాంబవంతుని వెంట విచిత్రమైన ఎలుగుబంట్లు లక్షలకొలదిగా వచ్చెను.

ఇట్లు వానరసేనలు, భల్లూకసేనలు అన్నియు సమకూడిన తర్వాత ప్రయాణభేరీ మ్రోగెను. వెంటనే అందఱును బయలు వెడలి, కొండలు,లోయలు, నదులు, దాటి, పోయి పోయి, తుట్టతుదకు సముద్రతీరము చేరిరి. అక్కడ శిబిరములలో సేనలు విడిసియుండగా, రాముడు, లక్ష్మణుడు, సుగ్రీవుడు, హనుమంతుడు, జాంబవంతుడు, తక్కిన వానరవీరులు భల్లూకప్రభువులు సమాసన్నులై సభచేసి, సముద్రము దాటుటకు ఉపాయము ఆలోచించిరి.

అప్పుడు రాముడు సముద్రములకు రాజైన వరుణదేవుని ప్రార్థింపగా, అతడు రామునికి ప్రత్యక్షమై నిలువబడి, దాశరథీ! "నాకు ఏపని నియోగింతువో చెప్పుము. నీయాజ్ఞ శిరసావహించుకొని చేసెదను" అని విన్నవించెను.

"వరుణుడా! దశకంఠుని శిక్షించుటకు ఈ సేనలతో లంకకు బోవలెను; సముద్రము దాటుటకుపాయమేమి?" అని రాము డడిగెను.

"రాఘవరామా! వానరసేనలో నలుడను శిల్పకారు డొకడున్నాడు. వాడు మిక్కిలి నేర్పుగలవాడు. సముద్రము మీద సేతువు కట్టుమని వానిని

ఆజ్ఞాపించిన యెడల వాడు నీ కోర్కె నెఱవేర్పగలడు. వాడు సముద్రము మీద వైచిన దెల్ల, కఱ్ఱగానీ, ఱాయిగానీ, మునిగి పోకుండ పైని తేలియుండు నట్లు నేను చేసెదను. ఇట్లు అచిరకాలములో సేనలు పోవుటకు తగిన సేతువు సిద్ధము కాగలదు.'' అని చెప్పి వరుణు డదృశ్యుడయ్యెను.

తర్వాత రామునియాజ్ఞ చొప్పున నలుడు సేతువు నిర్మింపగా సేనలన్నియు సులభముగా సముద్రము దాటి లంకకు బోయినవి.

శత్రుసైన్యము లంక మీదికి వచ్చిన దని విని, రావణుడు మంత్రులను సేనానాయకులను రావించి కర్తవ్యమునుగుఱించి ఆలోచించుటకు సభ చేసెను. పరాక్రమశాలు లగు రాక్షసవీరు లందఱును వచ్చియుండిరి. వారొకొక్కరు లేచి, "మనుష్యమాత్రులకు మనము భయపడువారము కాము. యుద్ధములో వారి నెల్ల నాశనము చేయుదము'' అని గర్వోక్తులు పలికిరి.

రావణాసురుని తమ్ముడు విభీషణుడును, ఆఱు నెలలు నిద్రపోయి అప్పుడే మెలకువ వచ్చిన కుంభకర్ణుడును మాత్రము, యుద్ధము మాని సంధి చేసికోవలయు నని చెప్పిరి. వారిద్దఱిలో విభీషణుడు ధర్మాత్ముడు; అతనికి ధర్మ మని తోచినది సంశయింపక నిర్భయముగా వ్యక్తపఱచినాడు. "రాముడు ధర్మాత్ముడు; రామునితో యుద్ధమునకు బూనుకొనుటవలన రావణునికి పరాభవమే కాక వంశనాశనమును అగును. పరమ పతివ్రతయైనసీతను రామునికిచ్చి సంధి చేసికొనుటయే నీతి.'' అని విభీషణుడు చెప్పిన మాటలు విని, రావణుడు కోపోద్రేకముచే కన్ను లెఱ్ఱజేసి చూచుచుండ, రావణకుమారుడైన ఇంద్రజిత్తు పినతండ్రివైపు జూచి, "ఇతడు వట్టి పిరికిపంద!'' అనెను.

విభీషణుడు, "నీతి విషయమై నీ కేమి తెలియును? చిన్న కుఱ్ఱవాడవు. ఊరకుండుము'' అని వానిని మందలించి, రావణునితో మరల, "నీవు నాకు రాజవు; అన్నవు; నీకును, నాకును, మన యందఱకును, హితమైన నీతినే నేను చెప్పుచున్నాను. సీతను రామునికి అప్పగించిన యెడల, అతడు మనలను క్షమించును. మనకు మఱి భయ ముండదు.'' అని బోధించెను.

"ఛీ! విభీషణుడా! నీకు సిగ్గు లేదురా! మిత్రుని వలె నాసభకు వచ్చి శత్రుప్రియమైన నీతులు ఉపన్యసించుచున్నావురా! పో! నీవు లం



కలో నుండ దగవు! నీ మొగము చూడగూడదు; పో! పో!'' అని రావణుడు వానిని కసరి తోలివేసెను.

విభీషణుడు తన భార్యతో జరిగిన దంతయు జెప్పి, రామునిపాలికి బోయి, శరణుజొచ్చెను. రాముడు వానికి అభయ మిచ్చి, వెంటనే వానిని సముద్రోదకముతో లంకారాజ్యమునకు రాజుగా అభిషేకము గావించెను. అప్పటినుండి విభీషణుడు విశ్వాసముతో రాముని పక్షమందుండి యుద్ధము చేయుచు అనేక విధముల అతనికి ఉపచరించెను.

## XXVII

## అంగద రాయబారము

రావణుడు తన పట్టణము శత్రువులకు చొర నశక్యముగా కట్టుదిట్టము చేసి, బలపర్చెను. దాని చుట్టును ఏడు ప్రాకారములును, ఏడు అగడ్తలును ఉండనే ఉన్నవి. గోడలు మిగుల ఎత్తైనవి. అగడ్తలు మిగుల లోతైనవి. వానిలో నిండుగా నీరును, భయంకరమైన మొసళ్లు, సొరచేపలు మొదలైన జలజంతువులును గలవు. ఇప్పుడు కోటగోడలపై యంత్రములు పెట్టించి పెద్ద పెద్ద పాషాణములు శత్రువులపై విసరుటకు కావలసిన సాధనములు సమకూర్చెను. అగడ్తల వెలుపల నేలపై వాడియైన యినుపశలాకలు పెట్టించెను. ఇవి గాక విషసర్పములను పట్టి తెప్పించి కుండలలో పెట్టి, గోడలమీద నుండి శత్రువులపై పడవేయుటకు సిద్ధముగా నుంపించెను. ఒకొక్క రాక్షసభటునకు విల్లును, అమ్ములపొదియే గాక, కత్తి, గద, గొడ్డలి, మొదలైన ఆయుధములు కూడ నిచ్చెను.

పట్టణము వెలుపల రాముని సైన్యము విడిసియుండెను. యుద్ధమారంభింపక ముందు శత్రువుకడకు రాయబారిని పంపుట ధర్మము గావున, వాలికుమారుడైన అంగదుని, నియోగించి, రావణునితో జెప్పవలసిన మాటలు బోధించి, రాముడు వానిని లంకలోనికి బంపెను.

రామునియాజ్ఞ చొప్పున అంగదుడు లంకలో ప్రవేశించెను. అతని చుట్టును భీకరాకారులైన రాక్షసుల గుంపులు కూడి కేకలు వేయుచుండిరి;

కాని, అతడు నిర్భయముగా కొలువుకూటమునకు బోయి, తన సందేశమును రావణునికి దెలియజెప్పెను. " రాక్షసాధిపా! రఘురాముడు నీతో జెప్ప బంచిన మాటలు అతని దూతనైననేను నానోటను చెప్పుచున్నాను వినుము:—

" నాభార్యయైన సీతను దొంగిలించి నీవు నాకు మిగుల నపకారము చేసినావు. నీదుష్కార్యము వలన అనేక నిరపరాధులకు మరణము కలుగగలదు. ఇంతే గాక, నీవు బలదర్పముచేత ఎన్నియో దారుణకృత్యములు చేసినావు. అరణ్యములందు తపస్సు చేసికొనుచుండు ఋషులను హింసించి చంపినావు. అనేక బ్రహ్మహత్యలు, స్త్రీహత్యలు, చేసినావు. నరమాంసముతిను క్రూరుడవు; నీకు దగిన శాస్తి కానున్నది. సీతను విడిచిపెట్టితివా, నిన్ను క్షమించెదను, లేకున్న, నీవును నీరాక్షసు లందఱును నాబాణముల మ్రందుదురు.''

ఈ మాటలకు గోపించి యంగదుని రాక్షసులు పట్టుకొన బోగా, అతడు ఒక్క గంతు గంతి గోపుర మెక్కి, అక్కడనుండి కోటవెలుపలకు నెగిరిపోయి, జరిగిన సమాచారము రామునకు నివేదించెను. అంతట రాముడు యుద్ధ మారంభింపు డని సేనాధిపతులకు ఆజ్ఞ యిచ్చెను.

## XXVIII

## లంక ముట్టడి

రాముడు రావణుని కోట ముట్టడింప మొదలుపెట్టెను. లంక చుట్టును ఆ వానరసేనలు, వేలు, లక్షలు, కోట్లు మూగినవి. లొట్టియపిల్ల దేహము వలె పాటలవర్ణము గల్గి వానరుల శరీరములు దివ్యముగా ప్రకాశించుచుండెను.

భల్లూకసైన్యముకూడ లంక ముట్టడిలో రామునకు దోడుపడెను. ధూసరశరీరములు, పొడుగాటి హస్తములు, దిట్టమైన పిడికిళ్లు కలిగి, ఈ యెలుగులు నిలువబడియు, చదికిలబడియు చిత్రముగా పోరుచుండెను.

కోటగోడల మీదికి నెగబ్రాకుచు గొందఱును, గంతుచు గొందఱును ఎక్కడ చూచినను వానరులే కనబడుచుండిరి. కోట వానరమయ మైనది. కొందఱు వరియెన్నుల లాగు పసపుచాయ గలవారు; కొందఱు మోదుగ పువ్వు లాగు ఎఱ్ఱనివారు; కొందఱు నల్లనివారు. ఇట్లు పలురంగుల యొడళ్లతో వానరసైనికులు కోటగోడలు మీద చిత్రముగా నగపడిరి. కొందఱు సభామంటపములలోని మణిమయస్తంభములు ఊడబెఱికిరి; కొందఱు మేడలపై గప్పులు విప్పివైచిరి. ఇట్లు నగరము విధ్వంసము జేయుచు గొందఱు వానరులు కోలాహలము చేయుచుండ, మఱి కొందఱు కోటగోడల మీదనున్న రాక్షసభటులను ఱాళ్లతో చిదుగగొట్టి పాఱదోలిరి.



అంతట పెద్ద దొక రక్కసుల మూక బయలుదేరి వచ్చి, వానరులను భల్లూకులను కోటనుండి తఱిమి కొట్ట మొదలుపెట్టెను. ఈ రక్కసులు పచ్చిమాంసము తిని, క్రొవ్వి, నల్లగా కొండల లాగు భీకరాకారులయి యుండిరి. ఇట్లు రాక్షసులును, వానరులను, భల్లూకులును, అఱచుచు, గర్జించుచు, పోరుచుండ బ్రహ్మాండము బ్రద్దలైన ట్లుండెను. రాముడును అనేక బాణములు కోటగోడల మీదికి వదలెను. ఆ బాణములు తగిలి వందలకొలది రాక్షసులు చచ్చిరి. కోటబురుజుల మీద నిలువబడి యున్న రాక్షసవీరులను పేర్కొనుచు లక్ష్మణుడు బాణములతో గొట్టికూల్చెను. ఆనాడు సాయంకాల మగునప్పటికి లంకాపట్టణము చుట్టు నున్న ప్రాకారములు నేలకూలినవి. ఇకను రాక్షసులు బయలున నిలువబడి యుద్ధము చేయవలెను.

## XXIX

## యుద్ధము

తొలినాటి యుద్ధముచేత అలసి విశ్రమించియున్న వానరులను ఏమఱించి చంపుటకై కొందఱు రాక్షసులు తమ మాయాబలముచేత నెవరికిని కానరాకుండ నదృశ్యులై వచ్చిరి. విభీషణుడు రాక్షసజాతివాడు గనుక వారి మాయ దెలిసికొని, వానరులకు వారు కనబడునట్లు చేసెను. అంతట వానరులు రాక్షసులను చూచి, దిగ్గన లేచి, వారిని చిదుకగొట్టి చంపిరి.

ఆ పిమ్మట రావణుడు పెద్ద సేనను వెంట బెట్టుకొని వచ్చి, వానరుల చుట్టును, తన రాక్షసుల నుంచి, శత్రువులను ఒక్క పెట్టున నొక్కి చంపవలయు నని వ్యూహము పన్నుచుండెను. రాముడు అతని పన్నుగడ దెలిసికొని, తన సైన్యముతో నడ్డుకొని, వాని ప్రయత్నము కొనసాగనియ్యలేదు.

అప్పుడు రావణుడు రాముని ఎదిరించి వానితో స్వయముగా యుద్ధము చేసెను. ఇంద్రజిత్తు లక్ష్మణు నెదిరించి పోరెను. సుగ్రీవుడు, విభీషణుడు, మొదలుగాగల సేనాధిపతులు, ఒకొక్కరు ఒకొక్క రాక్షస చమూనాయకునితో బెనగిరి. ఆయువుపట్లు గుఱి చూచి, బాణముతేయుచు, ఇరువాగుల యోధులును దొమ్మిగా యుద్ధము చేయుచుండిరి. ప్రహస్తుడను దైత్యవీరుడు పెద్ద ముసలము చేతబట్టి విభీషణుని చంపవలె నని మొత్తెను. విభీషణుడు పర్వతమువలె కదలక సావజ్ఞముగా దెబ్బకోర్చి, వానిచేత నున్న ముసలము లాగికొని, నూరు మువ్వలు కట్టియున్న పెద్ద కుంతము నొక దాని నెత్తి పట్టుకొని, తన బలము కొలదిని ప్రహస్తుపైని విసరి కొట్టెను. గుఱి తప్పక ఆ కుంతము వాని శిరస్సును ఖండించినది.

హనుమంతుడును పెక్కండ్రు రాక్షసవీరులతో ద్వంద్వ యుద్ధము చేసి వారిని చంపెను. అతడు మ్రాకులు పెఱికి తెచ్చి, వానితో శత్రువులను వారి రథములను చిదుకగొట్టెను. ఇట్లు రాక్షసుల మూకలును, వానర సేనలును, ఒక్కుమ్మడి పూనికతో ఘోరముగా పోరుచుండ ప్రచండవాయువుచే సంక్షోభించుచున్న మహాసముద్రము వలె రణరంగము మిక్కిలి భయంకరముగా నుండెను. తుట్టతుదకు రాక్షసులు వానరుల దెబ్బలకు తాళలేక, నిరుత్సాహులై యుద్ధభూమి విడిచి లంకలోనికి బాఱిపోయిరి.

## XXX

## కుంభకర్ణుడును ఇంద్రజిత్తును జచ్చుట

ఆ నాటికి కుంభకర్ణునికి నిద్రమత్తు తీరి బాగుగా మెలకువ వచ్చినది; రాక్షసుల పరాభవమునకు జింతించినవాడై తాను స్వయముగా యుద్ధము చేసెను. కుగభకర్ణుడు మహాయోధుడు; కాని, సామాన్యుడు కాడు. కవచము తొడిగికొని రథమెక్కి, పెద్దసైన్యమును వెంట బెట్టుకొని, రామలక్ష్మణులతో బోరుటకై బయలువెడలెను.

ధనుర్ధరుడైన లక్ష్మణుడు మొదట ఎదురుపడగా, వాని మీదికి కుంభకర్ణుడు రథము నడిపించెను. అదిచూచి, వానరులు కుంభకర్ణుని చుట్టును ఈగలు మూగినట్లు మూగి, వానిని కఱచియు, గీఱియు, చీఱియు, గిల్లియు



మిగుల అల్లరిచేసిరి. అది కుంభకర్ణునకు నొక లెక్కయా? ఒకమారు తన్ను వానరులు మిక్కిలి చీకాకుపెట్టినప్పుడు నవ్వుచు ఒక చెయ్యి చాచి ఆ రాక్షసవీరుడు పదిమంది వానర వీరులను పట్టి, నోటపెట్టుకొని గుటుక్కుమని ఒక్క గ్రుక్కను మ్రింగెను. వానరులు భయపడి కెవ్వుమని కేక వేసిరి. అది విని, సుగ్రీవుడు గబగబపరుగెత్తి వెళ్లి, ఒక మ్రాను పెఱికికొని వచ్చి, దానితో కుంభకర్ణుని నెత్తిమీద మొత్తెను. కోపము వచ్చి, కుంభకర్ణుడు సుగ్రీవుని జుట్టు పట్టుకొని ఈడ్చుకొనుచుబోయెను. అంతట, లక్ష్మణుడు వింటికి ఒక వాడి కోల దగిలించి, కుంభకర్ణుని యేసెను. ఆకోల రాక్షసుని కవచములోనుండి దేహములోనికి జొచ్చి, నేలకు గ్రుచ్చుకొని, వానిని మఱి కదలకుండ నొక్కియుంచెను. ఇట్లు కుంభకర్ణుడు పడి పెద్దనిద్దుర వోయెను.

అటుపిమ్మట రావణుడు అతి దుఃఖముతో నింద్రజిత్తును పిలిచి, "కుమారా! నీవు ఇంద్రుని జయించిన వీరుడవు. నరులును వానరులును నీ యెదుట నిలబడి పోరగలరా? నీవు పోయి యా రామలక్ష్మణులను ఆ సుగ్రీవుని, చంపి రమ్ము." అని యుద్ధమునకు పురికొల్పెను. ఇంద్రజిత్తు కవచాయుధములు ధరించి, రథారూఢుడై రణరంగమునకు వచ్చెను.

ఇట్లు వచ్చి, ఇంద్రజిత్తు ముందుగా లక్ష్మణుని యుద్ధము చేయుమని డీకొట్టెను. వారిద్దఱికిని జరిగిన సంగ్రామము అతి దారుణముగా నుండెను. ఇంద్రజిత్తు చిమ్మిన బాణము లన్నిటిని, లక్ష్మణుడు తన బాణములతో వెంటనే గుండపిండి చేసెను. అంతట ఇంద్రజిత్తు కుంతములను లక్ష్మణునిపై విసర మొదలుపెట్టెను. వీనిని కూడ లక్ష్మణుడు తన బాణములతో విఱిచివేసెను.

ఇట్లు ఈ వీరు లిద్దఱు బోరుచుండ, అంగదుడు పెద్దమ్రాను ఒకటి పెఱికికొనివచ్చి, ఇంద్రజిత్తు నెత్తిమీద పూని, ఒక దెబ్బ కొట్టెను. ఇంద్రజిత్తు తన గదతో అంగదుని తలమీద ఒక పెట్టు పెట్టెను గాని, ఆ దెబ్బ కోర్చి, మఱియొక చెట్టు నూడదీసి, శత్రువుపై విసరగా, అది రథమునకు తగిలి, రథము ముక్కముక్కలైనది. ఇంద్రజిత్తు మాయావి; కనుక, శత్రువులకు అదృశ్యుడై వారిమీద బాణవర్షములు కురియించెను. ఎక్కడనుండి బాణములు పడుచున్నవో కానరాకుండెను. కొన్ని బాణములు రాముని

మీదను, లక్ష్మణుని మీదను సైతము పడి, వారికి గ్రుచ్చుకొన్నవి. లక్ష్మణుడు నొప్పిచే మూర్ఛపోయి, నేలమీద వ్రాలెను.

అంతట, సుగ్రీవుడు మొదలైన వారందఱును లక్ష్మణుని చుట్టును మూగిరి. రాముడు తమ్మునికై విలపింపజొచ్చెను. అప్పుడు హనుమంతుడు వేగముగ నాకాశమార్గమున ఎగిరిపోయి, ఔషధముల కొండను మోచికొని, తెచ్చెను. మందు ఇచ్చిన కొంత సేపునకు లక్ష్మణునికి దెలివి వచ్చినది. తోడనే లేచి, నిలువబడి, అతడు మరల యుద్ధమునకు సిద్ధపడెను.

అప్పుడు విభీషణుడు వచ్చి, "శ్రీరామా! ఇదిగో కుబేరుడు ఒక వస్తువు మీకొఱకు బంపినాడు. అది మీ కన్నులకు అంటించుకొన్నయెడల అదృశ్యులుగా నున్నవారు మీకు స్పష్టముగా కనబడుదురు." అని అది రామున కిచ్చెను.

రామలక్ష్మణులును, సుగ్రీవుడు మొదలుగా గల సేనాధిపతులును, కన్నులకా దివ్యౌషధము పెట్టుకొనిరి. తోడనే, ఇంద్రజిత్తు వారికి అగపడెను. అప్పుడు లక్ష్మణుడు ఇంద్రజిత్తుపై మూడు బాణము లేసెను. అందొకటి వాని యెడమ చేతిని నఱికి, వింటితో గూడ నేలపడగొట్టెను. రెండవది కుడిచేతిని దానిలో నున్న బాణములను క్రిందపడునట్లు కొట్టెను. మూడవది వాని శిరస్సును ఖండించి, క్రిందికి దొర్లించెను. ఇట్లు ఇంద్రజిత్తు మిగుల నబ్బురముగా పోరి తుదకు ఈల్గెను.

## XXXI

## రావణ వధ.

పుత్రుని మరణవార్త విని, దశకంఠుడు క్రోధోద్రేకముచే రౌద్రాకారుడై, ఆకాశమందును ఎగిరిపోగల తన దివ్యరథ మెక్కి, నగరమునందున్న రాక్షసుల నెల్ల వెంటబెట్టుకొని, రామలక్ష్మణులను మ్రింగుదు ననుచు, అతిభీకరముగా యుద్ధరంగమునకు వచ్చెను. తన మాయచే రామలక్ష్మణులను పోలి యున్నట్టి యనేకులను తన శరీరమునుండియే పుట్టించి, రావణుడు తనవద్ద నిలువబెట్టెను. ఎటు చూచినను రామునకు లక్ష్మణుడే కనబడినట్లయి, బాణము లేయక, శంకించుచుండ, లక్ష్మణుడు, అన్నా! నా వలె నీకు కనబడుచున్న



వారు రాక్షసులు; మాయలవాండ్రు గనుక, నిన్ను మోసపుచ్చుటకు నా రూపమును వహించినారు. శంక లేక, కొట్టుము" అని చెప్పెను. అంతట రాముడు, బాణము లేసి, రాక్షసులను అనేకులను చంపెను.



రావణునితో యుద్ధము.

అప్పుడు ఇంద్రుని సారథి యైన మాతలి రాముని కడకు వచ్చి, నమస్కరించి, "రాఘవా! ఇది ఇంద్రుని దివ్యరథము. దీనిమీద గూర్చుండి యుద్ధము చేసి, పెక్కండ్రు దైత్యులను, దానవులను, ఇంద్రుడు చంపెగదా! పురుషసింహమా! నీవును ఇంద్రుని యట్లు దీని నెక్కి యుద్ధము చేసి, శత్రువులను సంహరింపుము" అని విన్నవించెను.

రాముడు ఆ దివ్యరథ మెక్కి, రావణు నెదిరించి పోరెను. రావణుడు భయంకరమైన కుంత మొకటి రామునిపై విసరగా, దానిని రాముడు ఒక బాణముతో పెక్కుతునకలు చేసెను. అంతట రాక్షసుడు తన కడనున్న ఆయుధముల నన్నిటిని ఎడ తెరిపి లేకుండ, వాన కురిసినట్లు రామునిపై పఱపెను. అప్పుడు రాముడు బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను. సువర్ణ పక్షములు గల ఒక బాణము తూణీరమునుండి తీసి, నారికి సంధించి, అర్ధచంద్రాకారముగా వింటిని వంచి, చెవి వఱకు నారి లాగి ఆ బాణమును విడిచెను. అది రావణునికి తగిలినతోడనే రథముతో గూడ వాడు మండిపోయి, మడిసెను. ఇట్లా పదితలలపాపాత్ముని బరిమార్చి, రాముడు ముల్లోకములవారికి మిక్కిలి మేలు చేసెను.

## XXXII
## సీతారాముల సమావేశము.

శత్రువులను జయించి, జయశాలియై, రాముడు శిబిరమం దుండగా, సీతను తోడ్కొని ముసలిది ఒక రాక్షసస్త్రీ రాముని యొద్దకు వచ్చెను. చింపిగుడ్డలు, ధూళితో నిండి యున్న యొడలు, మాసి జడకట్టిన తలవెండ్రుకలు, కృశించిన యంగములు, కలదియై, మసిపాతను ముడిచిన మాణిక్యమువలె, దివ్య తేజస్సుతో మెఱయుచున్న సీతను చూచి, రాముడు దుఃఖమును ఆనందమును బొందెను; కాని, ధీరుడు గనుక, తన మనోభావములు పైకి తెలియనీయలేదు. సీతను చూచి, "ఇంతకాలము రాక్షసుని యధీనమం దున్న నిన్ను మరల నే నెట్లు స్వీకరింతును?" అని రాముడు పలికెను.

ఆ మాటలు సీత చెవిని పడి, ఆమె గుండె ప్రక్కలైనది. ఆమె దురదృష్టము పండినట్లయ్యెను. త్రికరణ శుద్ధిగా భర్తయందే భక్తి కలిగి,



తన్ను చెఱనుండి విడిపించి తోడ్కొని పోవుటకు అతడు తప్పక వచ్చునని, ఎంతో ఆశతో రేపును మాపును ఎదురు చూచుచు, ఉవ్విళ్లూరుచు, తానుండగా, తుదకు వచ్చి, ఇట్లు నిర్దయుడై తన్ను అనరాని మాట లన్నాడే కటకటా! దుష్టవిధి యిట్లు చేసెనే!

దుఃఖాతిరేకముచేత, సీత మైమఱచి, నేల వ్రాలినది. మొట్ట మొదట, సూర్యప్రతాపమును మించి మెఱయుచున్న మగని మొగము జూచి మోదమొందిన యామె నయనాబ్జములు వికసించియు, తోడనే వాడి, కాంతిహీనమై వెలవెల బాఱుట గాంచి, వానరు లందఱును వగచుచు నిశ్చేష్టులైరి.

అప్పుడు చతుర్ముఖుడగు బ్రహ్మయును, ఇంద్రుడు, అగ్ని, వాయువు, యముడు, వరుణుడు, ఈశానుడు, మొదలైన దేవతలును రాముని కడకు వచ్చిరి. చిల్లర దేవతలు, గంధర్వులు, కిన్నరులు, యక్షులు, సిద్ధులు, సాధ్యులు, మొదలగు దివ్యపురుషులును విమానములతో వచ్చి, ఆకాశమంతయు నిండియుండిరి. అంతట జానకి లేచి నిల్చుండి, అంజలివట్టి, "మహారాజా! నిన్నేమియు నన బని లేదు. నీవు యుక్తాయుక్తములు ఎఱుగనివాడవు కావు. త్రికరణశుద్ధిగాను ప్రమాణపూర్వకముగాను నేను ఒక మాట చెప్పుచున్నాను, వినుము; 'నిన్ను తప్ప మఱి యెవరినైన నా హృదయమందు ఎన్నడును స్మరింపను, నేను చెఱనున్న కాల మంతయును నీ మూర్తినే ధ్యానించుచుంటిని'."

సీత ఆ వాక్యములు పలికిన తోడనే, ఆకాశమునుండి "రామా! సీత మాట నిజము! నీ భార్య పరమపతివ్రత. ఆమెను మరల స్వీకరింపుము" అని దేవత లందఱు ఎలుగెత్తి చెప్పిరి. బ్రహ్మాదిదేవతలును ప్రత్యక్షమై రామలక్ష్మణులను సీతను దీవించి, దుష్టరాక్షసులను సంహరించి శిష్టులను రక్షించినందులకు మెచ్చుకొనిరి. రాముడు పరమానందభరితుడై, దేవతల సన్నిధిని, వారి యాజ్ఞ చొప్పున సీతను చేపట్టి యాదరించెను.

"నీకు కావలసినది కోరుకొనుము; నీకు వరమియ్య వచ్చితిమి" అని దేవతలు చెప్పగా, రాముడు, "యుద్ధమందు మరణ మొందిన వానరు లందఱును బ్రదుకునట్లు అనుగ్రహింపవలెను," అని వేడుకొనెను. వెంటనే వానరులు సజీవులైరి. సీత హనుమంతునివైపు చూచి, "పింగాక్షా! వాయు

పుత్రా! రాముని కీర్తి యెంత కాలము ముల్లోకములందు స్మరణీయమై యుండునో, అంతకాలము నీవు సజీవుడవై యుందువుగాక ” అని వరమిచ్చెను.

ఇట్లు సీతను రామునికి ప్రియురాలిగా జేసి, లక్ష్మణుడును హనుమంతుడు మొదలైనవారందఱును, వారికి భక్తితో సేవచేయుచుండగా జూచి, సంతోషించి, దేవతలు అంతర్ధానమైరి.

## XXXIII

## అయోధ్యకు మరలి వచ్చుట.

రాముడు, లక్ష్మణుడు, సీత, విభీషణుడు, సుగ్రీవుడు, హనుమంతుడు, జాంబవంతుడు, ఇంకను తక్కినవారందఱును, కుబేరుని పుష్పక మెక్కి, ఆకాశమార్గమున అయోధ్యకు బోయిరి.

అయోధ్యకు సమీపముగా పుష్పకము వచ్చినప్పుడు, రాముడు వచ్చుచున్నాడని భరతునితో జెప్పుటకై హనుమంతుడు ముందుగా బోయెను.

జటావల్కములు ధరించి, మునివృత్తిని దీక్షతో రాముని పాదుకలు పూజించుచున్న భరతుని చూచి, అన్నయెడల అతనికి గల భక్తికి సంతోషించి, హనుమంతుడు రాముని సమాచారము అతనికి నివేదించెను.

భరతుడు ఆమాటలు విని, పరమానంద మొంది, మంత్రులను పురోహితులను రావించి, రాముని వార్త చెప్పెను. పట్టణమందు రామాగమన వృత్తాంతము సాటించి, గొప్ప ఉత్సవముతో భరతుడు ఎదురేగెను. రాముని పాదుకలు శిరస్సున మోచుకొనుచు, భరతుడు ముందుగా నడిచెను. శత్రుఘ్నుడు శ్వేతచ్ఛత్రము, చామరములు మొదలైన రాజలాంఛనములు పట్టుకొనివచ్చెను.

నలుగురు అన్నదమ్ములును మరల కలిసికొన్నప్పుడు వారికి కలిగిన సంతోషము ఎవరు వర్ణింప గలరు? ఒకరిని ఒకరు కౌగిలించుకొని, కుశలప్రశ్నములు చేసికొనిన తర్వాత, రాముని పాదుకలు రాముని పాదములకడ బెట్టి, వానితో గూడ వాని రాజ్యమును వానికి, భరతుడు మరల నప్పగించెను.

రామలక్ష్మణులును సీతయును క్షేమముగా మరలి వచ్చినందులకు జనులందఱును సంతోషించి, అయోధ్యాపట్టణము రమ్యముగా నలంకరించిరి.



వీధులు పన్నీట దడిపి, పువ్వులు చల్లిరి. ప్రతి యింటను తోరణములును జెండాలును కట్టిరి. ఎల్ల చోట్లను మంగళధ్వనులు వీనులకు విందుచేయుచుండెను.

వానరులు ఏనుగులమీదను రథములమీదను గుఱ్ఱములమీదను ఎక్కి,



సీతారాములు అయోధ్యకు మరలి వచ్చుట.

పురప్రవేశము చేసిరి. వారి పొడవైన తోకలు చిత్రవర్ణములు వింతచేష్టలు పురజనులు వేడుకతో జూచిరి.

సీతారాములు పట్టపుటేనుగుపై కట్టిన బంగారపు అంబారిలో

గూర్చుండి, ఊరేగిరి. శత్రుఘ్నుడు శ్వేతచ్ఛత్రము ఎత్తి పట్టెను; లక్ష్మణుడును హనుమంతుడును చామరసేవ చేయుచుండిరి. ఇట్లు ఊరేగి, వారు రాజమందిరము ప్రవేశించిరి.

అందఱికన్న నెక్కువగా కౌసల్యయు సుమిత్రయును సంతోషించిరి. పదునాలు గేండ్లు అరణ్యావాసము చేసి వచ్చిన కోడలిని కౌగలించుకొని ఆనందబాష్పములతో ఆమె చెక్కిళ్లు తడుపుచు, ముద్దు పెట్టుకొనిరి.

నాటిరాత్రి రాముడును సీతయును ఉపవాసముండి, జాగరణము చేసిరి. మఱుసటి దినము వారికి వసిష్ఠుడు పట్టాభిషేకము చేసెను. ఆ యుత్సవము మహావైభవముతో జరిగెను. పట్టాభిషేకమైన పిమ్మట, సుగ్రీవుడు మొదలైన వానరులకును, జాంబవంతునికిని వానిపరివారమునకును, విభీషణునకును వానితో వచ్చిన వారికిని, ఇంకను తక్కిన వారెల్లరకును, వారివారి కుచితమైన రీతిని రాముడు బహుమానము చేసి, సత్కరించెను.

సీత మెడలో కట్టాణిముత్యాల పేరొకటి సంతోషముతో రాముడు వేయగా, ఆమె అది తీసి, చేత బట్టుకొని, చిరునవ్వు నవ్వుచు, రాముని మొగము చూచెను. ఆమె మనోభావమును రాముడు తెలిసికొని, "నీ కిష్టులైన వారికి ఆ హారము పారితోషికముగా నీయవచ్చును" అని యనుజ్ఞ ఇచ్చెను. అంతట సీత ఆ హారమును హనుమంతుని కంఠమున వైచి, తన కృతజ్ఞతను ప్రకటించెను. హనుమంతుని యోగ్యతయును దానివలననే ప్రకటిత మయ్యెనుగదా. భరతుడును పదునాలుగు సంవత్సరములు రాజ్యమేలి, రాజ్యకాంక్ష లేక, భక్తియుక్తుడై అన్నకు రాజ్యము మరల నప్పగించెను గదా! ఇట్టి తమ్ముల సాహాయ్యమున చిరకాలము నెమ్మదిగా మహావైభవముతో రాముడు రాజ్యమేలెను.

MADRAS: G. C. LOGANADHAM BROS., THE GUARDIAN PRESS—1915.

# లాంగ్‌మన్స్ ఇండియన్ కథలు

[illegible] గారి పటములును, ఇంకయు ఇతరములగు చిత్రపటములును గలవి.

ఈ కథలు ఇండియన్ బాలుర ఉపయోగమునకై యే వ్రాసినవి. ఇందలి కథలు ఇండియనులకు చక్కగ తెలిసియుండునవి యగుటచే, బాలురు ఉత్సాహముతో జదువదగినవి. ఇంతేకాక పాఠముల పద్ధతి తరగతివారిగ నున్నది.

**Grade I**

| | |
|---|---|
| రాముడును సీతయును. 5 పటములు గలది. | 1½ అణా |
| సూర్యాబాయ్. 4 పటములు గలది. | 1½ అణా |

**Grade II**

| | |
|---|---|
| శ్రీకృష్ణుని బాల్యము. 9 పటములు గలది. | 2 అణా |
| పంచతంత్ర కథలు. 5 పటములు గలది. | 2 అణా |

**Grade III**

| | |
|---|---|
| దక్షిణాయిండియా కథలు. 8 పటములు గలది. | 3½ అణా |
| మహమ్మదీయ కథలు. 6 పటములు గలది. | |

**Grade IV**

| | |
|---|---|
| ఒక రాజు కథ. 8 పటములు గలది. | 5 అణా |
| శ్రీరాముని చరిత్రము. 10 పటములు గలది. | 4 అణా |

**Grade V**

| | |
|---|---|
| హిందూ పురాణ కథలు. 14 పటములు గలది. | అణా |
| హిందూ చరిత్ర వీరులు. పెక్కు పటములు గలది. | |

లాంగ్మన్స్, గ్రీన్ అండ్ కంపెనీ.
167, మౌంట్ రోడ్, మద్రాసు;
బొంబాయి, కలకత్తా.

